# చాటువులు

(కొన్ని తెలుగు చాటువులకు లోకాలోకన వ్యాఖ్య)

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

రిజిష్టరు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

A COMMENTARY ON STRAY TELUGU POEMS OF PAST-TIMES, BY Dr. IRIVENTI KRISHNA MOORTHY, READER IN TELUGU, POST GRADUATE COLLEGE, OSMANIA UNIVERSITY - HYDERABAD.



ప్రచురణ : 111

ప్రథమ ముద్రణ : జనవరి, 1985

ప్రతులు : 3,200

ముఖచిత్ర రచన : శ్రీ శీలావీర్రాజు

ముద్రణ :
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనము
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. 5/-

# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనం వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండేవిధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని గడచిన ఇరువయ్యేళ్ళుగా పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని 110 పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదేకాని మా సంస్థ వ్యాపార సంస్థకాదు.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యా సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యనిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1100 మంది, భారత భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షులు : యువభారతి

# మా మాట

శబ్దాలకు అర్థాలున్నై, శబ్దాల సమూహాలకు ఏదో ఒక భావం ప్రాతిపదికగా ఉంటుంది. అందరికీ అర్థమయ్యే భావాన్ని అధిగమించి, తమశక్తియుక్తులను నిరూపించేలా అందులో మరింకింత ప్రాణంపోసి, ప్రచారంలోకి తెచ్చి పదికాలాల పాటు ప్రజల హృదయాంతరాళాల్లో పదిలంగా మిగిలి ఉండేలా, వారి ఆలోచనా రీతులను ప్రభావితం చేసేలా మనకు మిగిలిన, పెద్దలు మిగిల్చిన పెరుగన్నం మూటలు ఈ చాటువులు. ఒకచోట చమత్కారంపాలు మించితే సూరేకారం, ఒక చోట శబ్ద చమత్కృతి, ఒకచోట భావవిన్యాసం, ఒకచోట ఎక్కిరింపు, మరొక చోట సాధింపు, ఒకచోట వ్యంగ్య వైభవం మరోచోట విరుపులకు పరాకాష్ట ఇలా మనల్ని ఆకట్టుకొని ఆ పద్యపాదం గుర్తొస్తే చాలు, సన్నివేశానికి బలం చేకూర్చేలా నిజంగానే ప్రాణంతో కదలాడే శబ్ద సమూహాలు ఈ చాటువులు; భావ సముద్రాలు ఈ చాటువులు.

మా ఇరివెంటి కృష్ణమూర్తిగారికి మాటపైఉన్న మమకారం ఎక్కువ. వారి గళం, బలం తెలిసినవారు కలంబలం చవిచూసే అవకాశం కల్పిద్దామని ఎంతో ప్రయత్నం చేసేకాని ఆయన కలం పట్టరు. బద్ధకస్తులని కాదు, పదాలకు నగిషీ పెట్టే తలపుతో కాబోలు, సానబట్టే ప్రయత్నం కాబోలు కలం బలంగానే సాగినా నిదానంగా సాగుతుంది. అయితేనేం ఆలస్యమైతేనేం లోకాలోకన వ్యాఖ్య పేరిట విలున్నంత ఎక్కువ మందికి అందుబాటులో ఉండేలా ఈ "చాటువులు" అక్షర రూపం దిద్దుకొన్నవి. తమ ఆలోచనలను పాఠకులతో పంచుకొనే భాగ్యం రచయితదైతే, భారం ప్రచురణ కర్తలది. గతంలో యువభారతి ప్రచురించి పలుసార్లు పునర్ముద్రణ పొందిన "ప్రజాసూక్తం, భావన" లాంటి పుస్తకాలను రూపు దిద్దడంలో కూడా కృష్ణమూర్తిగారి సిద్ధహస్తం కనబడుతుంది. ఇటీవల ప్రచురించిన వాగ్భూషణం భూషణంలో గళం, బలం గురించి, కలం, బలం ఎరుకపరిచిన తీరు. పాఠక లోకం ఎరిగినదే ఈ పుస్తకం కూడా మీ అభిమానపాత్రమౌతుందని ఆశిస్తున్నాము. మా కృష్ణమూర్తిగారికి, ఎన్నింటికో ఋణపడి ఉన్న మేము మాటలతో మా కృతజ్ఞతలను తెలియపరచి ఋణవిముక్తులము కాలేమని మాకు తెలుసు. అందుకే అక్షర భారతికి మరో మణిహారాన్ని యువభారతిచేత అందించే అవకాశం కల్పించిన మాలో ఒకరైన కృష్ణమూర్తిగారికి కృతజ్ఞత తెలుపవలసిన భారము మాతోపాటు రసజ్ఞ పాఠకలోకానిదని మనవిచేస్తూ మీ అభిప్రాయాలు తెలిపి యువభారతి కృషిని ప్రోత్సహించండని విన్నవిస్తూ.

డా॥ వంగపల్లి విశ్వనాథం

# అభివందనం

భగవంతునికి తన అందం చూసుకోవాలని కోరిక పుట్టిందట. ప్రకృతి అనే అద్దాన్ని కల్పించి అందులో తన నీడను చూసుకున్నాడట. అంతటా భగవంతుడు వ్యాపించిఉన్నాడనే ఈ పరమసత్యాన్ని ఉర్దూమహాకవి గాలిబ్ కవితాత్మకంగా చెప్పిన సందర్భం ఒకటి ఉన్నది.

అచ్చమైన కవిత్వంలో అందం ఎక్కడుందని వెదకితే ? ఎందుకువెదకాలె ? కొన్ని ప్రశ్నల సమాధానం ప్రశ్నగా మిగిలిపోతుంది. జిజ్ఞాస పిపాస అలాగే ఉండి పోతుంది. మానవుని పురోగతికి ఘంటాపథాలను పరచుకుంటూపోతుంది. అందం వస్తువుల్లో ఉండదు. చూసే కళ్ళల్లో ఉంటుంది. అనుభవించే మనస్సుల్లో ఉంటుంది.

కవిత్వం మనస్సంత విశాలమైనది. అది వెలుగులా అంతటా వ్యాపిస్తుంది. కవితాపరిమళాలను ప్రసరిస్తున్న కొన్ని పద్యాలు ఏ కావ్యంలోనూ ఉండవు. కొన్ని ఎవరు వ్రాసినారో తెలియదు.

అయినా కవితను ప్రేమించే వాళ్ళకు చాలాబాగా తెలిసి ఉంటాయి. కొన్నిటి కర్తృత్వం నమ్మకంగా తెలిసిఉంటుంది.

అందాల పూలమాలలోని ఏపూవును ఏరి అందమైందని చెప్పాలి? కష్టమేమరి.

ప్రసిద్ధులైన విద్వాంసులు అందించిన కొన్ని చాటుపద్యాలను ఏరుకుని, ఆ పద్యాలు చదువగానే ఏమనిపిస్తుందో, ఎంతదూరం ఆలోచించ దానికి వీలుంటుందో, ఏమని తోస్తుందో వ్యాఖ్యానించినాను. లోకాలోకన వ్యాఖ్య అనినామ కరణం చేసినాను. ఆ వ్యాఖ్యకు, ఈ సాహసానికి క్షంత వ్యుణ్ణి.

సుగృహీత నామధేయులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు, సంకలనం చేసిన 'చాటుపద్యమణిమంజరి' సంపుటాలనూ, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు సంకలనం చేసిన 'చాటుపద్యరత్నాకరము' అనే చాటువుల సంకలనాన్నీ, శ్రీ శ్రీరంగాచార్యులుగారి సంపాదకత్వాన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ప్రచురించిన 'చాటుపద్యరత్నావళి' అనే సంకలనాన్నీ చాటువుల ఎంపిక కోసం పరామర్శించినాను. చాటుపద్యాలున్న సంపుటాల నందజేసి నన్ను ప్రోత్సహించిన మిత్రవర్యులు, సహృదయులు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారికీ, డా॥ ఎల్లూరి శివారెడ్డిగారికి నా ధన్యవాదములు.

ఈ చాటు పద్యాల్లోని సారాంశాలకు సుదూరసంబంధాలు కల్పించి, వీటిలో సముద్రాలు ఒదిగిఉన్నాయని వివరించడానికి ప్రయత్నించినాను. నాటికీ నేటికీ ఇవి నిత్యసత్యాలను అందిస్తున్నవనీ, ఉడిగిపోని కవితాకాంతులను విరజిమ్ము తున్న మణిగణాలని నిరూపించడానికి ప్రయత్నించినాను.

సుహృన్మణులు, సహృదయులు, ప్రామాణికులైన పరిశోధకులు మా యువభారతి ప్రచురణల సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు నాయీ ప్రయత్నాని హర్షించి, ప్రోత్సహించి నన్ను ధన్యుణ్ణి చేసినారు. ఆ పరిషాత్ విదుషాం అన్నట్లు ఆయన వంటివారు మెచ్చుకుంటారు.

నా మిత్రులు ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు, శ్రీ యల్లాప్రగడ వివేకానందం డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు నన్ను వ్యాఖ్యానం వ్రాయమని ఎన్నివిధాలుగానో అనునయించినారు ప్రోత్సహించినారు.

మా 'యువభారతీయుల ప్రోత్సాహానికి ఫలితమే ఈ పుస్తకం.
సహృదయులు చదివి బాగోగులను గూర్చి తెలిపితే సంతోషిస్తాను.
నాతో ఈ కృషి చేయించిన 'యువభారతికి' అభివందనం.

తప్పులు లేకుండా పుస్తకం అందించాలనే ప్రయత్నంలో తగినంత సాఫల్యాన్ని పొందలేక పోయినాను.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి చాటుపద్యమణిమంజరిలోని ఈ రెండు చాటువులను ఈ పట్టున వ్యాఖ్యానం లేకుండా హరిస్తాను.

చేతప్పు నెఱుక మఱపును
నేతెఱఁగుననైనఁ గల్గు నెవ్వరికైనన్
వ్రాఁతం దప్పులు గల్గిన
బ్రాఁతిగ దిద్దుకొనుఁడయ్య పండితులారా!

వ్రాఁత తప్పువలన వాచకులలుగక
తప్పు గల్గెనేని తగిన యెడల
వలయు నక్షరములు వర్గించి సలుపుఁడీ
సుకవులయినవారు సురుచిరముగ.

—ఇరివెంటి కృష్ణమూర్తి

# చావులేని చాటువు

రమణీయార్థ శక్తితో, అందమైన అభివ్యక్తి లయబద్ధంగా లాస్యంచేసిన వాక్య జగతు కవిత్వం. కవిత్వానికి ప్రాణం ఉంటుంది; పరిమాణం ఉంటుంది. పరిమాణ మెంతదైనా ప్రాణం లేకపోతే పాషాణతుల్యమే అవుతుంది. కాబట్టి కవితకు పరిమాణం కంటే ప్రాణమే ప్రమాణం. ప్రాణ చైతన్యంతో జీవి చే పదమైనా, వాక్యమైనా కవితగా రాణిస్తుంది. ప్రాణం కవితలోని రమణీయార్థ శక్తి. అభివ్యక్తి ప్రాణాన్ని జీవిత చైతన్యంగా రూపొందించే మంత్రశక్తి అభివ్యక్తి అంతర్వ్యక్తిని అనుభవ రూపంగా మార్చటానికి తోడ్పడె శిల్పమార్గం లయ అనుభవ స్వరూపాన్ని అందించే చైతన్యస్ఫూర్తి. భావానుగుణంగా స్పందించటం స్పందింపచేయటం కవితలోని లయధర్మం. స్పందన లాస్యవైఖరిని వెలారుస్తుంది. లయ ఒక వైఖరిలో ప్రవహించే వాఙ్మయవాహిక వాక్యం. వాక్యం రసాత్మకం. కవితకు రూపం వాక్యం; ప్రవృత్తి లాస్యం; ప్రవాహం లయ; ప్రకృతి అభివ్యక్తి; ప్రాణచైతన్యం అర్థశక్తి; ఆత్మ అనుభూతి.

చాటుకవిత్వం అందంగా ఆహ్లాదంగా ఉండే కవిత్వం. అసలు కవిత్వానికే అందం ఆహ్లాదం అనేవి అవసరమైన లక్షణాలై ఉంటే చాటుకవిత్వానికి విడిని ప్రత్యేకంగా చెప్పటంలో విశేషమేమిటనే ప్రశ్న ఇక్కడ ఉదయించక తప్పదు. అందంగా ఉండటానికి వీలులేని చోట, ఆహ్లాదాన్ని కలిగించే అవకాశం లేనిచోట అందంగా, ఆహ్లాదంగా ఉండేటట్లు చెప్పే కవిత్వం చాటుకవిత్వం కావాలి. నిజానికి ఆ కవితా ప్రక్రియ స్వరూపాన్ని వివేచిస్తే ఈ సత్యం కొంతవరకు తేటతెల్లమౌతుందేమో !

చాటుకవిత్వం ఆశుకవిత్వ ప్రక్రియా, కావ్యకవిత ప్రక్రియా, గాథా కవిత్వ ప్రక్రియా సంగమించిన ఒక త్రివేణీ సంగమం లాంటిది. అందుచేతనే చాటుకవిత్వాన్ని నిర్వచించటం, నిర్ణయించటం చాలా కష్టం. ఆశుకవిత్వానికి వేగం ముఖ్యం. వర్ణవస్తువు కవి తనంతటతాను ఎన్నుకొన్నది కావచ్చు, కాకపోవచ్చు. ఏమైనా ఇచ్చిన గడువులో ఎదుటివారు మెచ్చేలాగా చెప్పటం అందులో ముఖ్యం. ఆశువులో సమస్య లుండవచ్చు; గారడీలు ఉండవచ్చు. రెండింటినీ సమయస్ఫూర్తితో చమత్కారజనకంగా చిత్రించటం ఆశువులో ఉన్న ప్రజ్ఞా విశేషం. ఆశువు బాణంలా దూసుకుపోతుంది ; మెరుపులా మెరుస్తుంది. కావ్యకవిత్వం వేగానికి దూరంగా ఉంటుంది. అది అంతర్మథనంలోనుంచి శిల్ప సుందరంగా ఆవిర్భవిస్తుంది. ప్రత్యక్షర సార్థక్యం దాని ప్రయోగ లక్షణం. ఇది అలవోకగా జాలువారేది కాదు ఆలోచనామృతంగా వర్షించేది. కావ్యం ఒక పద్యం కావచ్చు, బృహద్గ్రంథం కావచ్చు. అందులో నిలకడకూ, నిండుదనానికీ,

నిర్భరానందానికి ప్రాధాన్యం హెచ్చు. గాథాకవిత్వం ఈ రెండింటికీ మధ్యస్థం. అల్పాక్షరాలలో అనల్పార్థ రచనం ఈ శాఖకు జీవం. గాథలో కథ ఉండవలసిన అవసరం లేదు కాని, ఒక కథను స్ఫురింపజేసే ఒక వ్యథ మాత్రం తప్పకుండా ఉండాలి. కథకాని కథ; బాధగాని బాధ సుధామధురంగా ఇందులో జాలువారు తుంది. ఈ మూడు ప్రక్రియలకూ సాహితీజగత్తులో సమాదరం ఉంది. ఈ మూడింటిలోని ముచ్చటైన గుణాలను తనలో రంగరించుకొన్న ముత్తెంవంటి ప్రక్రియ చాటు కవిత్వం.

చాటు కవిత్వంలో ఆశుకవిత్వం ఉంటుంది. అయితే ఆశువంతా చాటువు కాదు. ఆశువులో ఐచ్ఛికంగా భాసించే సూక్తి చారుత్వం చాటువులో చాలవరకు నియతంగా నిలుస్తుంది. సమస్యాపూరణం చాటువు కాదు. కాని అభివ్యక్తిలో చాటువు అప్పుడప్పుడూ గారడీ చేస్తుంది. సూక్తిని చమత్కృతం చేయటం చాటువు లక్షణం. అందువల్ల ఆశువు కంటె చాటువుకు ఆయువు ఎక్కువ. కావ్యంలో కనిపించే అంతర్మథనం చాటువులో తక్కువ. కాని, మథనాన్ని ప్రదర్శించని చాటువు మాధుర్యాన్ని ఆదరిస్తుంది. మాధుర్యం ఒక అవస్థను ఆశ్రయించికాని, భావాన్ని ఆశ్రయించికాని అభివ్యక్తం కావటం అందులోని విశేషం. చాటువు కవి జీవితంలోని ఒక అవస్థను విశ్వజనీనం చేస్తుంది. అవస్థకు సంబంధించిన ఒక భావాన్ని కొన్ని, కొన్ని భావాలనుగాని ప్రస్ఫుటం చేస్తుంది. కావ్యంలో అటువంటివి పాత్ర నాశ్రయించి ప్రసరించవచ్చు. చాటువులో ఆత్మాశ్రయ ధోరణిని అందగించుకుంటాయి. కావ్యంలో చాటువు ఒక ప్రవాహంలో తరంగం లాంటిది. చాటువు ప్రత్యేకంగా ముత్తెపుచిప్పలోని వానచినుకు లాంటిది. గాథలో ఒక చిత్రం రూపొందుతుంది. చాటువులో ఒక స్వభావం రూపుకట్టు తుంది. గాథ చెప్పిన కవి తన జీవితంలో ఒక ఘట్టాన్ని పరిచయం చేయవచ్చు; కాని, చాటువు చెప్పిన కవి తన జీవిత స్వభావాన్నే వ్యంజింపచేస్తాడు. అందువల్ల చాటువు కావ్యం కంటె చిన్నది; గాథకంటె గుణంలో గొప్పది అవుతుంది. ఈ మిశ్రరూపం చాటువుకు అంటుమామిడి మొక్కకులా ఒక వైశిష్ట్యాన్ని కల్గిస్తుంది. చాటువును చదివి ఆనందించటం ఎంత సులభమో, దాని లక్షణాన్ని నిర్దేశించటం అంత కష్టం. చాటువులో అందమైన వస్తువు కంటె అందంగా చెప్పిన పద్ధతికే ప్రాముఖ్యం చప్పిడి వస్తువును ఒప్పిదంగాచేసి ఒప్పించేటట్లుచేసే సూక్తిధారయే చాటువు.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు చాటుపద్యాలకు లోకాలోకి వ్యాఖ్యాయ నంతరించే యత్నానికి పూనుకోవటం ముదావహం. ఇరివెంటి వారితో పరిచయం మున్న సాహితీమిత్రులందరూ ఏకగ్రీవంగా అనుకుంటే అంశం ఒకటి ఉంది.

ఆయన ఉపన్యాసక వృత్తిని స్వీకరించకుండా ఉంటే తప్పక చాటుకవిత్వం వ్రాసి ఉండేవారని, ఎందువల్లనంటే వారు మాట్లాడుతుంటే ఆశుకవిత్వంలా ఉంటుంది. అందులో ఆణిముత్యాల్లా జాలువారే సూక్తులు చాటుకవితలా ఉంటాయి. బహుశః వారి కొన్ని సూక్తులను వచన కవిత్వంలో చాటుకవితలంటే బాగుంటుందేమోనని అనిపిస్తుంది. అందువల్లనే ఆయనకు చాటు పద్యాలమీద ఘాటైన అభిమానం. ఆయన అధ్యాపకులు కావటంవల్ల చాటుపద్యాల అధ్యయనానికి తోడ్పడే ఒక వ్యాఖ్యానం వెలువడుతున్నది. మనసు పడటం వేరు; మార్గం వేయటం వేరు. మార్గంలో మహారాజుగా నడవటం వేరు. ఈ మూడూ వారి రచనలో ముప్పేటగా పెనవేసుకొనిపోవటం ఈ రచనకే ఒక క్రొత్త జిగివి కల్పించింది.

చాటువుల్లో శృంగార చాటువులకు ప్రత్యేక స్థానం ఉంది. అందులో ఔచిత్యంతో జీవించేవి కొన్ని; బూతుబుంగల్లా పొరలాడేవి కొన్ని. డా॥ కృష్ణమూర్తి గారు ఈ శాఖను ఇందులో గ్రహించలేదు. దానికి కారణం కూడా లేకపోలేదు. ఈనాడు శృంగారం సభ్యలోకానికి మొగం మొత్తింది. సినిమా పాటల్లో, వీధిమాటల్లో, సాహిత్యోపన్యాసాల్లో, సరససల్లాపాల్లో శృంగారం అశ్లీలాన్ని శ్లేషచమత్కారంగా పోషిస్తూ జాతి శీలాన్ని కలుషితం చేస్తోంది. శృంగారాన్ని రసంగా భావించి రమించే రసికత్వం లోకంలో కరువైపోయింది. అందువల్ల శృంగార శాఖను వ్యాఖ్యానించకుండా ఉంచటమే ఈ కాలానికి ఉచితం. కృష్ణమూర్తిగారు ఔచిత్యాన్ని పాటించారు.

చాటుపద్యాలు ప్రజల నాల్కలమీద నివసిస్తూ ఉంటాయి. వాటిని జాతి తరతరాలుగా ధారణలో నిలుపుకుంటూ ఉంటుంది. సమాజంలో విలువలు మారుతున్నప్పుడూ, విభిన్న ధోరణులు వెలుగులోకి వస్తున్నప్పుడూ కొన్ని చాటువులు కాలగర్భంలో కలిసిపోతుంటాయి. అప్పుడు వాటివి మరలా జాతికి కొందరు మనీషులు జ్ఞాపకం చేస్తుంటారు. ఆధునిక యుగంలో వాటిని స్వీకరించి, ముద్రించి వ్యాఖ్యానించి భద్రపరుస్తున్నారు. అటువంటి సేవ వాఙ్మయచరిత్రలో, మరువరానిది. డా॥ ఇరివెంటివారు చాటుపద్యసేకరణలో పాటుపడిన పెద్దలనందరినీ స్మరించి కృతజ్ఞతలు చెప్పారు. వారు ప్రచురించిన సంకలనాల్లోనుంచే ఈ పద్యాలను ఎన్నుకొన్నారు. మన్నికగల పద్యాలకు మనసుతో వ్యాఖ్యానం వ్రాశారు.

"కవితాస్వాదనం కవితసృష్టివలెనే ఒక అపురూపమైన విషయం" అన్నారు డా॥ ఇరివెంటివారు చాటువు జీవితానికి ఒక వాతాయనం లాంటిది. వాతాయనాన్ని నిర్మించేది కవి. చూచేవాడు సహృదయుడు; చూచేవిధానాన్ని, చూచినవియాషల వివరణాన్ని చెప్పేవాడు వ్యాఖ్యాత, ఈ వ్యాఖ్యానం పేరు లోకాలోకనం లోకాన్ని

చూడటం ఈ వ్యాఖ్య చేసేవని. డా॥ కృష్ణమూర్తి గారు కవితలోని అందాన్ని చెప్పేదాని చందాన్ని వ్యాఖ్యానించారు; అభివ్యక్తిని చెప్పి అనుభవ విశ్లేషణను వివరించారు; లోనారసిచూచి లోకప్రవృత్తిని వ్యాఖ్యానించారు. చాటుకవి ఉక్తిలో ఇమిడిఉన్న లోకవ్యుత్పత్తిని ఆవిష్కరించి చూపించారు. "అనుభూతికి శబ్దాకృతి కవిత" అని సూక్తులనూ చెప్పారు; కవితను గురించి కమనీయంగా చెప్పిన చాటువులలోని కవితాత్మ కన్నులకు కట్టేటట్లు ప్రదర్శించి చూపించారు. నిధిక్షేపాలనూ అపహాస్యాలనూచేసే పద్యాలవెనుక ఉన్న ఆదర్శసూత్రాలను వివరించారు. అన్యాప దేశాలలోని అంతరార్థాలనూ వాక్యోవాక్యాలలోని చతుర తాత్పర్యాలనూ, సత్కృతి పద్యాలలోని పొలతియైనభావాలనూ లోకోక్తుల వంటినూక్తి పద్యాలలోని అనుభవపు లోతుల్నీ, కాకువుల్లోని కళాపం వంటి నిజాలనూ, ఆత్మశాఖల్లోని అంతశ్శక్తుల్ని నీతులను బోధించే చాటువుల్లోని ప్రామాణికత్వాన్ని, అలంకారగౌరవంగల పద్యాల్లోని శోభావైవిధ్యాన్ని, పద్యాలలోని తీయందనాలనూ, ప్రశంసాపద్యాల్లోని ప్రయోజకత్వాన్ని పొడుపుకథల్లాంటి పద్యాల్లోని వెలుగు రేకల్ని, వివరించి చెపుతూనే నవ్యజీవితానికీ ఉన్న అనుబంధాన్ని వ్యాఖ్యానించారు.

చాటువులు ఏకాలంలో పుట్టినా అన్నికాలాల్లో అవి చెలామణి కాగలవనీ, ఏకవి వ్రాసినా వ్యక్తి అనుభవం లోకానుభవంగా పరిణమిస్తుందనీ, జాతి జీవనంలోని నలుపుతెలుపులను చిత్రించే ఈ కవితలు జాతి భవిష్యత్తుకు మార్గదర్శకం కాగలవనీ, వాటిలోని ఉపరంజనంతో పాటు ఉపదేశం కూడా సమాదరణీయమనీ. ఈ లోకాలోక వ్యాఖ్య మనకు స్పష్టం చేస్తున్నది.

చాటు పద్యాలకు చావులేదు. పద్యం ఛందోమయం ఛందోమయమైన చాటువులే ఇందులో ఉన్నాయి వచనంలో చాటువు బ్రతకదా ? వచనచాటువులు కూడా లయతో బ్రతకవచ్చు. పూర్వకవుల చాటుపద్యాలతో పాటు ఆధునికుల చాటువులనూ సేకరిసే మరెన్ని ఫణుతుల్లో ప్రత్యక్షమౌతాయో, పద్యాలూ గేయాలూ, వచనాలూ, ఎన్నోకనపడవచ్చు, చాటుఫణితికి పోటులేని ప్రక్రియలేదు. పద్ధతి లేదు; ప్రదేశం లేదు; భాషలేదు. చాటింపు లేనిదే పాటింపులేని ఈ రోజుల్లో చాటుకవితకు కూడా కొంత సహకారంకావాలి. ఈప్రచురణ ఆ ప్రయత్నంలో ఒక ప్రయోగం!

23-12-1984.

— జి. వి. సుబ్రహ్మణ్యం

" రహే హుదూద్ కె అందర్ తొ హోష్మదీ హై
జబాన్ వర్నా ఖుదానె హర్ యెక్ కొ దీ హై"

ఇది ఒక ఉర్దూ షేర్ (పద్యం) ఉర్దూభాషలో వెలసిన ఒక ప్రామాణిక నిఘంటువు "తహజీబుల్లొగాత్' (సంస్కృతి నిఘంటువు) ఉపోద్ఘాతానికి శ్రీకార ప్రాయంగా వెలుగుతున్న సూక్తి తిలకమిది. కవితా స్వరూపానికి నిలువుటద్దంగా ఉన్న సూక్తి ఇది. ఈ ఉర్దూసూక్తికి తెలుగువేషం వేయవచ్చుకాని ఆత్మా విష్కృతి అసాధ్యం. అనువాదంలో ఇయ్యబడేది భావం మాత్రమే. నిజానికి ఒక భాషలోని భావం మరొక భాషలోకి రావడం, సమగ్రస్వరూపంతో రావడం, నిర్దుష్టంగా రావడం, పోల్చుకో లేనంత సమైక్యభావంతో రావడం చాలా అరుదైన అంశం. 'అనువాదం' అంటే మళ్ళీ అనడం. అంటే చిలుక పలికినట్లు పలకడం. అందుకే మన ప్రాచీనాంధ్ర కవులు ఎవ్వరూ కూడా 'అనువాదం' అనే మాటను ప్రయోగించలేదు. ఆంధ్రీకరించుట, తెనుగు సేయుట, తెనిగించుట వంటి మాటలనే ప్రయోగించినారు కాని 'అనువదించితి' మని ఎక్కడా అనలేదు. శబ్ద స్థితినీ, అర్థవిస్తృతినీ తలస్పర్శిగా అవగతం చేసుకున్న మహనీయులు వారు. ఇటీవల అనువాదమనే మాట ప్రచారంలోకి వచ్చింది. ఇంగ్లీషులో Translation అనే పదం ఉన్నది ఆ భాషలో కూడా ఈ శబ్దానికి భాషాంతరీకరణం అనే అర్థమేకాకుండా జీవన్ముక్తుడు కావడం, రూపాంతరం పొందటం ఇత్యాది అర్థాలు ఉన్నవి. కనుక ఈ ఉర్దూపద్యానికి నేను అనువాదం చేసే సాహసానికి పూనుకోవడం లేదు. కవిత్వానికి అనువాదం పాండితీ ప్రకర్ష అనిపించుకుంటుందేమో కాని హృదయావిష్కరణం అనిపించుకోదు. ప్రతిభాషకు ఒక సంగీతం ఉంటుంది. ఆ భాషలోని వాక్యాలకు ఒకలయ ఉంటుంది. ఆ భాషలోని పదాలకూ అర్థాలకూ, ఆ భాష మాట్లాడేవారి సంస్కృతికీ సంబంధం ఉంటుంది. అయితే

భారతీయ భాషలకు ఇతివృత్తాన్నీ, సాహిత్య శాస్త్రాన్నీ, శబ్దజాలాన్నీ అదించిన సంస్కృత భాష భారతీయ భాషామరవాహినులకన్నిటికిని గంగోత్రి అయినది. సంస్కృతంలో పరిచయం ఉన్నవారు సర్వభారతీయ భాషా సాహిత్యాలస ఆత్మను సందర్శించుకో గలుగుతారు. ఏ దేశ భాషా కవి కూడా యావద్భారత కవి. ఇప్పటికి కాలేక పోయినాడు సర్వభారతీయులకు వాల్మీకి కవి, వ్యాసుడు కవి. కాళిదాసు కవి భారవి కవి భాసుడు కవి. జయదేవుడు కవి.

ఉర్దూభాషకూడా సంస్కృతం నుంచి పుట్టిన ప్రాకృత, అపభ్రంశ భాషల బిడ్డ. భారతీయమైన సంస్కృత ప్రాకృతాలే కాకుండా భారత పశ్చిమోత్తర దేశాలలోని అరబ్బీ, పార్శీక పదాల ఉపనదులతో ఉర్దూభాషా స్రవంతి సమృద్ధమై ప్రవహిస్తున్నది ఉర్దూ అచ్చమైన భారతీయ భాష. పలువాసల పూలనూల ఉర్దూభాష బహు పరిమళాలను గుబాళిస్తున్న భాష.

ముందుగా నేనుదాహరించిన ఉర్దూపదాన్ని వివరించి తెలుగు చాటు పద్యాల స్వరూప స్వభావాల గురించి చెప్పి పఠితలను అలరించే ప్రయత్నం చేస్తాను.

ఇదీ ఉర్దూలోనుఉన్న చాటువే (భగవంతుడు భాషను ప్రతివానికివరంగా ప్రసాదించినాడు.) అయితే ఆభాషనుహద్దుల్లో ఉంచుకోవడంలోనే వివేకం ఉన్నదన్న అర్థాన్ని ఈ ఉర్దూసూక్తి ప్రబోధిస్తున్నది.) అంటే భగవంతుడు ప్రసాదించిన భాష అనే అనంత శక్తికి అవధులు లేవు కాని మనిషి విచక్షణతో, వివేకంతో భాషను ప్రయోగించాలె. ఎప్పుడు, ఎక్కడ, ఏ విధంగా మాట్లాడాలో తెలుసుకొని మాట్లాడాలె. చూచి తూచి మాట్లాడాలె. మాట మనిషి వ్యక్తిత్వానికి పరిచయ పత్రం. మాట మనిషి హృదయానికి దర్పణం సత్యమైన మాట సుందరంగా ఉంటుంది. సత్యసౌందర్యంతో ప్రకాశిస్తున్న మాట శివప్రదంగా మంగళం ప్రదంగా ఉంటుంది. కనుకనే భారతీయ ఋషులు 'సత్యం, శివం, సుందరం అన్నారు. అందమైన మాటకున్న విలువ ప్రపంచంలో దేనికీ లేదు. అందమైన మాట కాలంగీసిన గీట్లను చెరిపి బ్రతుకుతుంది. దేశాలు గీసుకున్న పొలిమేరలను దాటి పయనించ గలుగుతుంది. అందమైన మాట హృదయం నుంచి పుట్టుకొస్తుంది. మళ్ళీ తాను పుట్టిన హృదయం లాంటిది మరెక్కడైనా, ఎప్పుడైనా

దొరికితే అక్కడ సేద తీర్చుకుంటుంది. అక్కడినుంచి మళ్ళీ ప్రసరిస్తుంది. రిలే యంత్రం లాగా ప్రసరణ గమనాన్ని పుంజుకుంటూ కొనసాగిస్తూ ఉంటుంది.

భారతీయ మహాకవులలో మహోన్నత స్థానాన్ని అలంకరించినవాడు భవభూతి. మనకంటె పదకొండు వందల సంవత్సరాల క్రితం బ్రతికినవాడు. అతడు ద్రష్ట, స్రష్ట, దార్శనికుడు. మానవజీవితతత్త్వాన్ని కవితా బద్ధం చేసిన మహనీయ ప్రతిభా సమన్వితుడు. ఒక మంచి మాట— సత్యాన్ని ఆధారంగా చేసుకుని పుట్టినమాట— అనుభవాన్ని పునాదిగా చేసుకుని పుట్టినమాట కలకాలం ఉంటుంది. ఈ విశాల జగత్తులో ఈ అనంత కాలంలో ఎక్కడైనా, ఎప్పుడైనా తనకు సమాన ధర్ముడైన వాడు పుట్టకపోడు. తనను అర్థం చేసుకోక పోడు అంటూ కవితామయ సూక్తికి నిర్వచనాన్ని ప్రసాదించినాడు భవభూతి. తన 'మాలతీ మాధవం' నాటకంలోని ఈ శ్లోకంలో.

"యేనామకే చిదిహనః ప్రథయ స్త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ ప్రతినైషయత్నః
ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా
కాలోహ్యాయం నిరవధిర్విపులాచపృథ్వీ"

కాలం మారుతున్న కొద్దీ మనిషి దైనందిన జీవితంలో వస్తున్న మార్పులు ద్విధా విభక్తాలుగా గోచరిస్తూ ఉంటాయి. బాహిరంగా జీవితాన్ని సుఖమయం చేసుకునే ప్రయత్నం నాగరకత అనిపించుకుంటుంది. అంతరంగాన్ని పాశవికతా ప్రభావం నుంచి తప్పించి మానవతాదృక్పథంతో మలచుకునే ప్రయత్నం చేయడం సంస్కృతి అనిపించుకుంటుంది. మనిషి కూడా ఒక పశువే. అనంత కోటి జీవిరాశిలో ఒక అంశమే కాని ఆ పశుత్వపు పొలిమేరలను దాటడానికి అతడు ప్రయత్నంచేసినప్పుడల్లా తన సంస్కృతిసౌధానికి తానొక్క సోపానాన్ని నిర్మించుకో గలిగినాడు. అతనిలోని సౌందర్యపిపాస అతణ్ణి కవిని చేసింది. గాయకుణ్ణి చేసింది. అతనితో నాట్యమాడించింది. అతనికి చిత్రసృష్టి నేర్పింది. సృష్టికి ప్రతిసృష్టిచేసే యోగ్యతను ప్రసాదించింది. సౌందర్య పరిరక్షణలోనే,

సంస్కృతి పరిరక్షణలోనే తన శాశ్వతత్వాన్ని మనిషి చూసుకోగలిగినాడు. అనుక్షణం సౌందర్య సందర్శనం సమున్నత మానవతాదర్శం.

భారత దేశంలో పుట్టి కవితాసృష్టిలో హిమానీ శృంగాగ్రాల నందుకున్న మాఘుడు సౌందర్యాంతరాన్ని ఇలావ్యంజించినాడు.

"దృష్టోఽపి శైల స్సముహుర్మురారే
రపూర్వ విస్మయ మాత తాన,
క్షణే క్షణే యన్నవతాముపైతి
తదేవరూపం రమణీయతాయాః"

ఎన్నెన్నిమారులు దర్శించినా ఆ పర్వతం ఆ పూర్వానుభూతులనే ప్రసాదిస్తున్నది ఇది యథార్థం. క్షణ క్షణం అంటే చూసినప్పుడల్లా కొత్తదనాన్ని కనిపింపజేసే గుణమే సౌందర్యం. అంటే అందమైన మాటను విన్నప్పుడు మళ్లీ మళ్లీ అదే మాటను వినాలనిపిస్తుందో, ఒక సుందర దృశ్యాన్ని చూసినప్పుడు మళ్లీ మళ్లీ ఆ దృశ్యాన్నే చూడాలనిపిస్తుందో, ఒక మనిషి కలుసుకున్నప్పుడు మళ్లీ మళ్లీ కలుసుకోవాలనే తహ తహ ఎక్కువౌతుందో ఆ ఔత్సుక్యమే సౌందర్యం. అదే మాట అయితే కవిత్వం. పాటైతే సంగీతం. ఆటైతే నృత్యం. చిత్రమైతే చిత్రలేఖనం. ఇలా ఎన్నో ఎన్నో!

మాట లయబద్ధంగా వెలువడినప్పుడు పాటో, పద్యమో అవుతుంది. పాటలు, పద్యాలు కావ్యాలౌతాయి. కాని కొన్ని పద్యాలు ఝటితి స్ఫూర్తిగా కవి నోటి నుంచి వెలువడుతాయి. ఏదైనా సంఘటనవల్ల కవి హృదయం పొంగి పొరలి పద్యంగా ప్రవహించవచ్చు. ఒక అందమైన భావం అలవోకగా ముక్తక మౌక్తికంగా కాంతులీనుతుంది. ఒక్కొకసారి అలాంటి పద్యంలో ఏవేవో కథల జాడలు కనిపించవచ్చు. ఏ చారిత్రకవ్యక్తి ఆనవాళ్లు కనిపించవచ్చు కవి గుండె కడలి పొంగి నింగిలోని జాబిల్లిపై నురగలు చిందవచ్చు. కవిని కలవరపెట్టిన ఘట్టమేదో పద్యమై పారవచ్చు. విస్మయచిత్తంతో కవి నివ్వెరపోయి తాను చూసిన కొత్త వింతను ఆశువుగా వర్ణించి పద్యంలో కుదించవచ్చు.

మన తెలుగు కవులు వెయ్యేళ్లనుంచి తమ రసవత్కవితామృత ధారలతో తెలుగు రసికుల హృదయకేదారాలలో పసిడి పంటలు పండిస్తూనే ఉన్నారు. మహాభారత, రామాయణ, భాగవతాది ఇతిహాస పురాణ పూజాకుసుమాలతో. మనుచరిత్ర, కళాపూర్ణోదయాది ప్రబంధ చందనాలతో, ద్విపద, శతక, ఉదాహరణ యక్షగానాది కావ్యకళా నీరాజనాలతో తెలుగు కవితాశారదను ఆరాధించి తరించి తెలుగుప్రజలకు సంతరణ మార్గాన్ని ఉపదేశించి ధన్యులైనారు, అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసులు తమ సంగీత సాహిత్య పారమార్థిక భావసంపదలను తెలుగు గుండెల ముంగిళ్లలో కుమ్మరించి చరితార్థులైనారు.

ఈ మహాకవుల బ్రతుకు బరువుల సంగతులు మనకు అంతగా తెలియవు. వాళ్లు వ్రాసుకొనలేదు. ఒకరిద్దర తప్ప ఎవ్వరూ వ్రాసి పుణ్యం కట్టుకోలేదు. ఆ మహా కవులు కావ్యాలలో ఇతివృత్తానికే ప్రాముఖ్యాన్ని ప్రసాదించినారే కాని, కవితా పారమ్యానికి పట్టం కట్టినారేకాని తమ వైయక్తిక అనుభూతులకు ఎక్కడో గాని తావీయలేదు. వారికి కోపమో, తాపమో, అనురాగమో, ఆనందమో, అవహేళనభావమో, భక్తిభావమో, కలిగినప్పుడు అప్పటికప్పుడు వారికి కలిగిన అనుభూతులు పద్యాలుగా అవతరించినవి. అదృష్టవశాన అవి అక్కడున్నవారి చెవులకెక్కినవి మనస్సుల్లో పాదుకొన్నవి. ఆనోటా ఈనోటా పడి బ్రతికి తాటాకులపైకి ఎక్కినవి. కాగితాలపైకెగబ్రాకినవి. ఇలాంటి పద్యాలు తెలుగు కవులవి వేన వేలున్నవి. వీటినే చాటు పద్యాలంటారు.

సాహిత్య ప్రక్రియలు ఎన్నో ఉన్నవి. పురాణమున్నది. ఇతిహాసమున్నది. ప్రబంధమున్నది. శతకమున్నది. రూపకమున్నది. ఉదాహరణమున్నది. తారావళి ఉన్నది. చిత్రబంధ కవితలున్నవి. కాని చాటుపద్య రచనకు ఏ లాక్షణికులు బందోబస్తులు చేసిన జాడలు కనిపించవు. కాని లాక్షణికులకు లక్ష్యాలుగా అనేక సందర్భాలలో చాటు పద్యాలను బాసటగా తీసుకొనవలసివచ్చింది. ఈ చాటు పద్యాలు ఎవరో మహాకవులు చెప్పినట్టు ప్రచారంలో ఉంటాయి. ఏమిటి దీనికి ప్రమాణం ? శ్రీనాథుని చాటువులు, పోతన చాటువులు, తెనాలివాని చాటువులు ఇంకా ఎందరెందరో మహాకవుల చాటువులు బ్రతికి ఉన్నవి. కావ్య రసికుల

గుండెల్లో తలదాచుకున్నవి. కొన్ని చాటువులు శబ్దాలంకరణకు, మరికొన్ని శ్లేషార్థాలకు, మరికొన్ని పొడుపుకథలకు, మరికొన్ని ధారాశుద్ధికీ, మరికొన్ని కవితా పారమ్యానికి, మరికొన్ని సామాజిక జీవిత వృత్తానికి, మరికొన్ని కవుల విశృంఖలతకు, మరికొన్ని మహాకవుల పాండిత్య పీఠానికీ, మరికొన్ని రాజుల లోగిళ్లలో పన్నిన కుట్రలకూ, మరికొన్ని అధిక్షేపానికీ, మరికొన్ని కేవలం హాస్యరస సృష్టికీ, మరికొన్ని సంస్కారహీనుల అశ్లీల భావాలకూ, మరికొన్ని ప్రణయ సరిత్తరంగాలకూ, మరికొన్ని భక్తిభావ బంధురతకూ, ప్రతీకలై నిలిచిపోయినవి.

"వాక్యం రసాత్మకం కావ్యం" అన్న అభియుక్తోక్తి సజీవోదాహృతులు ఈ చాటువులనే ముక్తకాలు. మహాకావ్య సంకేతానికి నోచుకోలేకపోయినా మహాకవి ప్రయుక్తాలుగా, కవితా ప్రపంచంలో సుస్థిర స్థానం సంపాదించుకున్నవి.

ఈ చాటువులు కొందరు ప్రాచీన కవుల జీవిత విశేషాలను చెప్పక చెప్ప గలిగినవి. ఈ చాటువులు చరిత్ర రచనకు ఉడుతా—భక్తిగా తోడ్పడినవి. మహాకావ్యాలు చదివే ఓపికగాని, సామర్థ్యంకాని లేనివాళ్లకు కావ్యరసాస్వాదనాను భూతిని కలిగింపజాలినవి. నవరసాల రసాలాలను పండించి కవితా పిపాసువులకు విన్నంత మాత్రాన కవిత్వాన్ని అందించగలిగినవి.

నిన్నటి, మొన్నటి చాటు పద్యాలే మనకింకా పూర్తిగా అందుబాటులో లేవు. ఇక ఈ శతాబ్దంలో పుట్టిన వేనవేల చాటువుల సంగతి సందర్భాలు తెలుసుకోవడం ఎంత కష్టమో ఊహించవలసిందే. నిన్నటి తరంలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, డా॥చిలుకూరి నారాయణరావుగారు, శ్రీనిడుదవోలు వేంకటరావుగారు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు, శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు, నేటి తరంలో శ్రీరావూరి దొరస్వామి శర్మగారు, శ్రీ ఆరుద్రగారు, శ్రీ శ్రీరంగాచార్యులుగారు, శ్రీమతి ప్రొఫెసర్ లలితగారు, శ్రీ చొల్లేటి నరసింహశర్మగారు ఇంకా ఎందరెందరో కావ్యరసికులు చాటువులను సేకరించే ఉద్యమంలో నిమగ్నులై ఉన్నారు. నాకు తెలిసినంత మేరకు కొందరిని పేర్కొన్నానే కాని ఈ మహా ప్రయత్నంలో పరిశ్రమిస్తున్న మహనీయుల నెందరినో నా పరిమిత జ్ఞానంవల్ల తెలిసికోలేకున్నందుకు క్షంతవ్యుడను.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారివలె ఎవరైనా పూనుకొని ఈ చాటుపద్య సాహితీ సంపదను ఆంధ్రావళికి అందించే కృషికి పూనుకుంటే కవిత్వోద్యమానికి ఇతోధిక మైన ప్రచారం లభిస్తుంది.

ప్రాతస్మరణీయులు యశఃకాయులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఇలాంటి పద్యాలనుగూర్చి అన్న మాటలను ఇక్కడ ఉట్టంకించడం అప్రస్తుతం కాదనుకుంటాను.

"తీరుతీయములుగల భాషావాహినియందు సుకవుల కవితామృతము ప్రబంధరూపమునకాక చాటురూపముననుు జాలువాఱును. వీనులకు విందులై డెందమును దనుపార్చుచుఁజాటు రచనము లొక్కొక్కయెడఁ బ్రబంధ రచన ములనైతము మీఱియుండునని చెప్పుట భాషావేదులకనుభవ పునరుక్తమగును. గ్రంథములుగా నేర్పడమిచేఁదొల్లింటి యాంధ్రకవీశ్వరులు రచించిన చాటుపద్యము లెన్నేని యునికి తప్పినవి. పరంపరాగతములగుచుఁ గొన్ని పల్లెటూళ్లలో ముదసళ్ల నోళ్లయందును, మఱికొన్ని పురువులకు భుక్తులువెట్టు ప్రాచీన తాళపత్ర సంపుటములందును జీర్ణించుచున్నవి".[1]

ఇంతకూ చాటుపద్యం అంటే ఏమిటి ?

చాటు పద్యం అంటే ఏమిటో వివరించకుండానే చాటువుల గురించి ఎంతో చాటింపు చేసినాను. నిజానికి చాటుపద్యం అంటే తెలియని తెలుగురసికుడెవరు ? సిసలైన తెలుగు రసికునికి చాటు పద్యాన్ని గురించి చాటుగా చెప్పవలసిందేగాని పలువురి ముందు చెప్పడానికి ప్రయత్నిస్తే ఘాటైన చాటుపద్యంతోనే సమాధానం చెబుతాడు.

'చాటు' అనే సంస్కృతం మాట తెలుగులో 'చాటువు'గా రూపొందు తుంది. 'చాటు' అంటే ప్రియమైన మాట. కొందరు ఉదాహరణము అని కూడా అర్థం చెబుతారు. శ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రిగారు తమ 'ఆంధ్రవాచస్ప

1. తొలిపలుకు, చాటుపద్య మణిమంజరి — వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము. రెండవ కూర్పు 1949.

త్యం'లో "అప్పుడప్పుడు కవి ఆశువుగా చెప్పిన పద్యములు" (గ్రంథస్థము కానివి) అని అర్థమును వివరించినారు. మెనియర్ విలయమ్స్ అనే సంస్కృతాంగ్ల నిఘంటు రచయిత 'చాటు' అనే పదానికి Pleasing or graceful words, Discourse, Flattorj, Speaking distinctly, Speaking agreeably or kindly అనే అర్థాలనిచ్చినాడు. సంతోషప్రదంగా సంభాషించడం, పొగడటం, అందంగా మాట్లాడటం, అనుకూలంగా మాట్లాడటం, విశిష్టంగా మాట్లాడటం అన్న అర్థాలతో 'చాటు' పదాన్ని వివరించినాడు. నిజానికి ఈ గుణాలన్నీ, ఈ లక్షణాలన్నీ కవిత్వానికే వర్తిస్తాయి కనుక 'చాటూక్తి' 'కవితోక్తి' అన్నా ఇంచుమించు ఒక్కటే కావ్యం వేరు, కవిత్వం వేరు, కావ్యంలో ఇతివృత్తం,నాయకుడు,రసనిర్వహణం,వర్ణనంఇత్యాదిలక్షణా లుంటాయి కవిత్వానికి ఇన్ని హంగులు అక్కరలేదు కావ్యానికి కవిత్వం అలంబనం కాని కవిత్వానికి ఆలంబనం చమత్కృతి, భావసౌందర్యం, అర్థగాంభీర్యం, శ్రవణ సుభగత్వం అవసరమవుతాయి. ఒక్క పద్యంలో, ఒక్కమాటలో, ఒక్క సామెతలో, కవిత్వం పొంచి ఉంటు ది.

"ఛీకుక్కా !" అంటే, "ఏమక్కా" అన్నదట. ఇది ఒక సామెత. ఇందులో ఒక లయ ఉన్నది. శబ్దాలంకారమున్నది. ధ్వని ఉన్నది. కనుక ఈ సామెతలో కవిత్వం ఉన్నది అని చెప్పవచ్చు. అదే పథంగా కవుల చాటు పద్యాలు ముక్తకాలుగా ఉండికూడా సామెతలకున్నంత శక్తిని పుంజుకుని నోటి నుంచి నోటికి, చెవి నుంచి చెవికి, మనసు నుంచి మనసుకి పదిలంగా పండిత పామర రంజకంగా ప్రాచుర్యాన్ని అందుకున్నాయి. ఒందు రెండు చాటు పద్యాలతో పరిచయంలేని సాహితీ ప్రియులుండరంటే అసంభావ్యమేమీకాదు.

ఉబికివచ్చిన భావాన్ని పద్యంగా మలచి చిమ్మివేయడమే తప్ప ఇతరేతరమైన ఏ నియమ నిబంధనలకు ఒదగనిది చాటుపద్యం, సామెతకు ఉన్న సంక్షిప్తత, సూటిదనం, జనప్రియత్వం, స్ఫూర్తి, నిష్ప్రయత్నంగా, ప్రాచుర్యాన్ని సంపాదించుకునే శక్తి చాటు పద్యానికి ఉంటాయి. ఒక చాటూక్తి తనలో కవితాత్మను పొదుగుకుంటుంది. ఆయాకవులు చెప్పిన చాటువులుగా కొన్ని పద్యాలకు ప్రచారం ఉన్నది. ఇందులో నిజం ఎంత ఉన్నదో తెలియరాదు. ప్రచార బాహుళ్యం కోసం ఎవరో ఆయా కవులకు ఆయా చాటు పద్యరచనలతో

సంబంధం కల్పించి ఉండవచ్చు. ఏది ఏమైనా, అందమైన పదాల పొందికవల్లనో, చిమ్ముతున్న అర్థ చమత్కృతి వల్లనో ఆ చాటు పద్యం కావ్య రసికుల జిహ్వాగ్రాలపై లాస్యమాడుతూ ఉంటుంది.

తెలుగు చాటు పద్యాల సాగరంలోని కొన్ని రత్నాలవంటి పద్యాలను ఎన్నుకున్నాను. అతివేలమైన శృంగారానికీ, చారిత్రిక పురుషుల సమాచారానికీ, వేదాంతతత్వానికీ సంబంధించిన చాటుపద్యాల జోలికి నేను పోలేదు. మన కాలానికీ, మన జీవిత సమస్యలకూ ఒకవిధంగా వ్యాఖ్యానం చేయగలుగుతున్న పద్యాలనే ఎన్నుకున్నాను. వినోదానికికాక, విజ్ఞానానికి తోడ్పడే చాటువులనే ఎన్నుకున్నాను. ఎప్పుడో, ఏ కవిసత్తముడో, ఏ రసోదయవేళలో చెప్పిన పద్యమో మరి! కాని ఇప్పుడిప్పుడే అరవిచ్చిన అరవిందంలా అందాలనూ, ఆమోదాలనూ గుబాళిస్తున్నది. మన బ్రతుకును సతమతం చేస్తున్న అనేకానేక సమస్యలకు ఏదో ఒక పరిష్కారాన్ని అందిస్తున్నట్టున్నది. చాటూక్తి అంటే అందమైనమాట. ఎప్పటికీ అందంగానే ఉంటుంది. మాసిపోయేది అందంకాదు. కీట్స్ అనే ఆంగ్ల మహాకవి "A thing of beuty is joy forever" అన్న సత్యాన్ని మాఘుని వలెనే ప్రకటించగలిగినాడు.

తెలుగు చాటు పద్యాలను సేకరించి వాటిని అచ్చుపోసి, భద్రపరచుకుని, ఈ తరానికే కామ రానున్న తరాలకుకూడా అందించాలన్న ఆకాంక్ష తెలుగు భాషా బంధువుల హృదయక్షేత్రాలలో అంకురిస్తే నాయీ చిన్నప్రయత్నం సఫలమవుతుందని నమ్మినాను. కొండంత దేవునికి ఒక్క చిన్నపూవునర్పించినట్లు, చంద్రునికి ఒక నూలుపోగును సమర్పించినట్లు నేను ఈ ప్రయత్నానికి సాహసించినాను.

1951-53, 1953-55లో నేను ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి వద్దనూ, ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారి వద్దనూ తెలుగు భాషా సాహిత్యాలను బి.ఏ, ఎం.ఏ పట్టాల కోసం అధ్యయనం చేస్తూ ఉండేవాణ్ణి. అప్పుడు ఆచార్య దివాకర్ల వారు మాకు పాఠ్యగ్రంథంగా ఉన్న శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి 'శృంగార శ్రీనాథము'ను బోధిస్తూ శాస్త్రి గారి బహుముఖీన ప్రజ్ఞా పాండిత్యాలతో పరిచయం కలిగించినారు. ముఖ్యంగా తెలుగు చాటువు

లను గూర్చి శ్రీ శాస్త్రిగారు చేసిన విశేష కృషిని ఎంతో ఆర్ద్రంగా, ఎంతో వాత్సల్య సముపేతంగా, ఎంతో విజ్ఞాన వర్ధకంగా, మాకు బోధించి, మమ్మల్ని భాషా సేవకులుగా తీర్చిదిద్దినారు. ఆ మహితాత్ముని బోధన, ఆశీర్బలం మాకు తెలుగు భాషలో అభినివేశాన్ని, భారతీయ సంస్కృతి పట్ల అభిమానాన్ని పెంపొందించినవి. ఆ వాఙ్మయ దివాకరుడు మా మనఃపద్మాలను వికసింపజేసినా డని మా విశ్వాసం. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు మాలో పరిశోధనా సక్తిని మేల్కొలిపిన దేశికోత్తములు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి, ఆచార్య లక్ష్మీరంజనంగారికి భక్తిపురస్సరంగా అభివందనాలను సమర్పించు కుంటున్నాను.

చాటు పద్యాల మీద నాకు ఆదరభావాన్ని కలిగించి అమేయశక్తి సంపన్న మైన ఈ వాఙ్మయ శాఖపట్ల నాకు అభిరుచిని కలిగించిన పుస్తకం శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంకలితమైన 'చాటుపద్య మణిమంజరి'. విద్యత్కవులుగా, సత్య గవేషణా దృక్పథం ఉన్న సాహిత్యవిమర్శకులుగా, అరుదైన వచన రచనా విశారదులుగా, యోగివతంసులుగా, బహుగ్రంథ ప్రణేతలుగా, తెలుగు ప్రజల జీవితాన్ని పునీతం చేసిన మానవోత్తములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. ఆయనకు హృదయపూర్వకమైన భక్తిపురస్సరమైన అభినందన సహస్ర ములను సమర్పించుకుంటున్నాను.

చాటువులు పలుతీరులుగా ప్రజాబాహుళ్యంలో ప్రాచుర్యాన్ని అందుకు న్నవి. సంస్కృత భాషా సాహిత్యాలతో మన తెలుగుకు విడదీయరాని సంబంధం ఉండటంచేత, సంస్కృత శబ్దజాలం, సాహిత్యశాస్త్రం, ఇతివృత్త సంపద ఇత్యాది తెలుగులోకి ప్రవేశించి ఈ భాషను సమృద్ధం చేయడమేకాక ఎన్నో ప్రక్రియలను అందించగలిగింది. ఆశుకవిత్వం, చిత్రకవిత్వం, బంధకవిత్వం, గర్భకవిత్వం వంటి కవితారీతులతో పాటు సంస్కృతంలోని అష్టావధాన, శతా శతావధాన, సహస్రావధాన కవితా విధానపద్ధతులు భారతీయ భాషా పండితు లకూ కవులకు తెలిసినా, వాటిని మన తెలుగు దేశంలో అధికాధికమైన ఆదరాభి మానాలు లభించినవి. అవధాన కవితాకళానిర్వహణం వల్ల తెలుగు దేశంలో కావ్యకళకు ఎనలేని దోహదం లభించింది. సంస్కృత భాషలో అవధానాలు నిర్వహించి యావద్భారత కీర్తినార్జించి ఆంధ్రపండితులనేకులు.

అవధానాలు చేస్తున్నప్పుడు అనివార్యంగా ఆశుకవిత, సమస్యాపూరణం వర్ణనం, దత్తపది, నిషేధాక్షరి వంటి సందర్భాలు వస్తాయి. ఆ వేళల్లో అప్పటి కప్పుడు ఆయాకవులు చెప్పిన పద్యాలు కూడా చాటుపద్యాలుగా నిలిచిపోయినవి. అవధానాలు చేస్తున్నప్పుడు కవులు ప్రదర్శించే పాండితీ గరిమ, కవితా ప్రభ సహస్రదళ పద్మంలా విచ్చుకుంటుంది. సదస్యులకు అబ్బురపాటు కలిగిస్తుంది. తిరుపతి వేంకటకవుల "జగదాశ్చర్యకరావధానకవితా సంపత్తి" ని రసప్రలుబ్ధులింకా కొల్లగొట్టుకుంటూనే ఉన్నారు. గొదేపల్లి సూర్యప్రకాశరావు, పిశుపాటి చిదంబరశాస్త్రి అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, పోకూరి కాశీపత్యవధాని, వేలూరి శివరామశాస్త్రి దుబ్బాక రాజశేఖరశతావధాని, కొప్పరపు కవులు, రామకృష్ణ కవులు, గడియారం వేంకటశేషశాస్త్రి నిన్నటితరాన్ని ఉర్రూతలూగించి ఎన్నో చాటు పద్యాలనందించిన కావ్యకళాపారీణులు.

ఆదికావ్యం రామాయణావతరణానికి దారితీసిన 'మానిషాద' శ్లోకం చాటువే!

కరుణానిలహృదయుడైన వాల్మీకి మహనీయుని శోకమే శ్లోకమయినది.
చాటుపద్యం మహాకావ్య రచనకు నాందీ వాచకమైంది.

త్ర్యంబకం వద్ద బొట్టు బొట్టుగా పొటమరించిన గోదావరి రాజమహేంద్రి వద్ద అఖండ గోదావరి అయినట్లే చాటు శ్లోకం వాల్మీకిలోని కవిని బయటకు తీసింది.

తననోటి నుంచి లయబద్ధమైన వాక్యం వెలువడగానే అతనికి ఆశ్చర్యం కలిగింది.

క్రౌంచపక్షి పతనాన్ని చూసిన వాల్మీకి గుండె ఆక్రోశించింది.
ఆ ఆక్రోశం శోకమై ఆ శోకం శ్లోకంగా అవతరించినది.
ఇది ఒక సంఘటన!
ప్రతీకాత్మక సంఘటన.
కవిత్వావిర్భావాన్ని వ్యంజిస్తున్న సంఘటన.

కవిత పుట్టదు మాటల గారడి కొరకు.
కవిత పుట్టదు శబ్దాడంబరాల జాతరకు
కవిత పుట్టదు గుండె కదలనిదే.
కవిత పుట్టదు గుండె పొగలినదే.
కవిత పుట్టదు ఉబికిన గుండెకు లయాత్మక భావం తోడుకానిదే!
అనుభూతికి శబ్దాకృతి కవిత.
సృష్టి భగవంతుని కవిత
ప్రతి మనిషి మనసులో కవిత సుప్తంగా ఉంటుంది
అనుభూతిలయలు మేల్కొలిపితే, శబ్దం తోడైతే కవిత జాగృతమవుతుంది
కవిత శశిబింబం.

అది ప్రతి ఫలిస్తుంది సంద్రంలో, సరస్సులో, సరితలో, నీళ్ల గిన్నెలో కిన్నెల్లో, మహాకావ్యంలో, మందహాసంలో, మనసులో, పలుకులో, పసిపాప నవ్వుల్లో. మహితాత్ముని చూపులో, చాటుపద్యంలో, జవరాలి కనుగొనల్లో, కళాకారుని తపస్సులో కొన్ని చాటుపద్యాల్లోని వెన్నెలలను దోసిళ్లకెత్తి కవితాపిపాస తీర్చుకుందాము.

తల్లీ! నిన్నుఁదలంచిపుస్తకముచేతంబూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా సూక్తుల్ సుశబ్దంబు శో
భిల్లంబల్కుము నాదవాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
పుల్లాబ్జాక్షి! సరస్వతీ భగవతీ!పూర్ణేందు బింబాననా! 1

పదిహేనవ శతాబ్దంలో ప్రభవిల్లి 'పూర్వకవి జననంభావనంబు గావించి వర్తమాన కవులకు ప్రియంబు పలికి భావికవుల బహూకరించి'' న ఏకైకాంధ్రకవి సత్తముడు బమ్మెర పోతన. అచ్చుపడిన కొన్ని భాగవత ప్రతులలో ఈ పద్యం ఉండటంవల్ల పోతన దేమోనని తెలుగు నాడులో పలువురికి నమ్మకం ఉంది. కర్తృత్వం మాట ఎలా ఉన్నా నా చిన్నతనంలో అక్షరాలు నేర్చుకుంటున్నప్పుడు (నాకిప్పుడు 55 ఏళ్లు) ఈ పద్యం ముందు కంఠస్థం చేయించేవారు. ఈ పద్యం నోటికి వచ్చిన తరువాతనే అక్షరాభ్యాసం. అప్పుడు బడిపిల్లలందరికీ ఈ పద్యం నోటి కొచ్చేది.

ఈ పద్యంలో చిత్రమేమిటంటే సులభోచ్చారణ ఉన్న పదాలున్నవి. కఠినోచ్చారణ ఉన్న పదాలు ఉన్నవి పద్యం నోటికి వస్తే ఉచ్చారణాసుభగత్వ మబ్బుతుంది.

అమ్మా! నిన్ను స్మరిస్తూ పుస్తకం పట్టుకున్నాను. నీవు నా బుద్ధిలో, నా మనస్సులో నిలిచి మూగతనం లేకుండాచేసి, నంగి, నత్తి మాటలు రాకుండా చేసి అంటే మంచి ఉచ్చారణా శక్తిని కలిగించి సుస్పష్టతను ప్రసాదించు ఉచ్చారణ సరిగా లేకపోతే అర్థం స్పష్టంకాదు.

నీకు జగత్తును మోహింపజేసే శక్తి ఉన్నది కొందరు పలికితే ఎంతో మనోహరంగా ఉంటుంది. కొందరు పాడితే మహామనోజ్ఞంగా ఉంటుంది వాక్కులకు అంత శక్తి ఉంది.

నీవు ఫుల్లాబ్జాక్షివి విచ్చుకున్నతామరవిరి వంటి కన్నులుగల దానివి. ఇక్కడ 'అక్షి' శబ్దానికి విశేషార్థం ఉన్నది. అక్షి దూరంగా వ్యాపించేది. విద్యకు ప్రసరించే గుణం ఉంది. అని అంతరార్థం. దేశకాలాల అవధులు దాటిపోయే శక్తి జ్ఞానానికి అంటే శారదకు ఉన్నది. అని అర్థం.

నీవు 'భగవతి'వి అంటే ప్రతిభామూర్తివి – కాంతిమతివి.

సరస్వతీ- అంటే ప్రవహించే గుణం గలదానివి. విద్యకు ప్రవహించే గుణం ఉన్నది.

జ్ఞానం ప్రవహిస్తుంది. ఆగేది జ్ఞానం కాదు. నిరంతర తపస్సు విద్య అని ధ్వని

సరస్వతీ ప్రార్థనలో ఇంత మహార్థాన్ని ఇముడ్చుకున్న చాటువును శైశవ దశలో నేర్పే జాతి సంస్కృతిని సంరక్షించుకోవడం మన కర్తవ్యం.

అక్షరంబువలయుఁ గుక్షిజీవనులకు
నక్షరంబు జిహ్వకక్షరసము
అక్షరంబు తన్నురక్షించుఁగావున
నక్షరంబు లోకరక్షితంబు. 2

ఎవరిదో ఈ చాటుపద్యం. ఇప్పటికీ అక్షరంగా ఉన్నది. అక్షరం అంటే ఇక్కడ కేవలం ధ్వనికి చిహ్నం కాదు. జ్ఞానానికి సంకేతం జ్ఞానంలేనిదే ఎవడూ బ్రతకలేడు. మంచి మనిషిగా బ్రతుకలేడు. నాలుకకు చెరుకురసం ఎంత హాయినీ, ఎంత తృప్తినీ, ఎంత ఆనందాన్నీ, ఎంత ఆరోగ్యాన్నీ, ఎంత ఉత్సాహాన్ని కలిగిస్తుందో జ్ఞానం కూడా జీవితానికి అంతే ఆనందోత్సాహాలను ప్రసాదిస్తుంది. అంతే కాదు అందమైన మాట నాలుకనుండి వెలువడినప్పుడు విన్నవాళ్లకు ఇక్షురసప్రాయమే మరి! అక్షరాన్ని నమ్ముకున్నవారు సర్వదా సంరక్షితుడు. మనిషికి జ్ఞానమే శ్రీరామరక్ష. మోక్షాన్ని ప్రసాదించి సర్వవిధాలా మానవుణ్ణి రక్షించే దేవతాత్మకమైన బీజాక్షరాలను గురించి కూడా ఈ పద్యంలో భంగ్యంతరంగా సూచన ఉన్నది. లోకం అక్షరాన్ని అంటే జ్ఞానాన్ని ఎందుకు సంరక్షించుకుంటుంది? ఎందుకు పెంపొందించుకుంటుంది? లోక రక్షణ సామర్థ్యం అక్షరానికి ఉన్నది కనుక.

కదలిని కడువలో ఇమిడ్చినంత పని చేసినాడు కవి ఈ పద్యంలో. 'క్షరము' అంటే నాశము అక్షరము అంటే నాశనము కానిది. కనుకనే అక్షరం పరబ్రహ్మ స్వరూపం అన్నారు పెద్దలు. అక్షరాన్ని భద్రపరచుకోవాలంటే స్వచ్ఛమైన ఉచ్చారణాదక్షతను అలవరచుకోవాలె. సదుచ్చారణ అక్షరానికి ప్రాణంలాంటిది. నోటిని స్వచ్ఛంగా ఉంచుకోవడానికి ప్రయత్నంచేస్తే సదుచ్చారణ సాధ్యమౌతుంది. భక్ష్యా భక్ష్య వివక్షణాది ఆచారవ్యవహారాలను అలవరచుకోవలసి వస్తుంది. ఉచ్చారణ సరిగా లేకపోతే మాటనెవ్వడూ వినడు పట్టించుకోడు.

దేవునాన మున్ను దేశానికొకరుండ
నిప్పుడూర నూర నింటనింట
నేవు రార్వు రేడ్వురెనమండ్రు తొమ్మండ్రు
పదువురైరి కవులు పద్మనాభ 3

దేశం ప్రజల తపస్సు ఫలించి, దేశీయ సంస్కృతి వికసించి, దేశభాష సమృద్ధమై ఆ దేశానికి, ప్రియమైన విలువలకు ప్రాచుర్యంకలగాలనే మహోన్నతా

కాంక్షకు ప్రతీకగా ఒక యుగంలో ఒక కవి జన్మిస్తాడు. యుగ యుగాలు కదచినా ఆ కవిభావాలు ప్రజాజీవనంతో పెనవేసుకపోయి బ్రతుకుతూ ఉంటాయి. కవితాప్రతిభ దైవదత్తం. లేదా పుట్టుకతోనే అబ్బిన లక్షణం. కీర్తికోసం, ప్రతిష్ఠకోసం, ధనంకోసం, సుఖంకోసం కవిత్వాలు అల్లినవాళ్ల కాలగర్భంలో కలిసిపోతారు. ప్రజాభిరుచులు పక్కలు దొరలిస్తే, అలాంటికవుల కవిత్వం కూడా దొరలిపోతుంది మళ్లీవాల్మీకి పుట్టడు. మళ్లీ వ్యాసుడుపుట్టడు కాళిదాసు మళ్లీ అవతరించడు. శ్రీశ్రీకి నకిలీ శ్రీశ్రీలు మళ్లీ పుట్టరు. విశ్వనాథ వారిలాగా అభినయించే అభినవవిశ్వనాథలు పుట్టుకురావచ్చునేమోకాని మళ్లీ విశ్వనాథపుట్టడు. కళారంగంలో అనుకరణం, అనురణనం, అనుసరణం ఆరంభించే దశలోనే. ఎదిగిన కవిత్వంలో ఇతరుల ముద్రలు కనిపించడం అసంభావ్యం, అసమంజసం. సొంతవాణి, సొంతబాణి అనవాళ్లు అసలైన కవితారూపానికి. అలాంటి అసలైన కవి దేవుని అనుగ్రహంవల్ల ఒక్కొక్కయుగంలో ఒక్కొక్కడు పుడుతాడు చరితార్థుడౌతాడు. అతని పేరు కవికిపర్యాయవాచి అవుతుంది. నిఘంటువులో 'కవి' అనే పదానికి 'వాల్మీకి' అనే అర్థంకూడా వ్రాసి ఉంది. ఎవడో కవికి, గుంపులు గుంపులుగా పుట్టుకొస్తున్న నకిలీ కవులచూసి హేళన చేయాలనిపించింది. ప్రతిభాహీనులపట్ల, మనసులో ఉబుకుతున్న అసహ్యభావం బుస్సున పొంగింది పద్యంలా.

ఎవడో ఆ కవి? ఎప్పుడొచ్చిందో అతడికాకోపం? అతడి కోపం పద్యమైంది.

దేవుని దయవల్ల దేశానికి ఒక కవి ఉండేవాడట. ఇప్పుడు ఊరూర, ఇంటింట, ఐదుగురు, ఆరుగురు, ఏడుగురు, ఎనుమండుగురు, తొమ్మండుగురు, పదుగురు, కవులు పుట్టుకొస్తున్నారు అని సంఖ్యాబాహుళ్యాన్ని చెప్పి ఊరు కుంటే ఆ వరస అదోరకంగా ఉండేది. దేవుడికి ఎన్నో పేర్లుండే 'పద్మనాభ' అని సంబోధించినాడు. అంటే ఆ సృష్టికర్త అయిన బ్రహ్మ, విష్ణునాభిలో నుంచి పుట్టుకొచ్చినాడు. సృష్టికర్తనేకన్న ఆదిదేవుడు చేసిన అన్నవ్యవస్థ సృష్టి ఇట్లా పరిణమించింది. ఎక్కడ చూసినా కవులే. అంతా కవులైతే ఇక రసికుడికి తావెక్కడ!

అంకెలను అదేపనిగా పద్యంలోకి ఇరికించి కవిచేసిన తమాషా ఎంత హాస్యస్ఫోరకంగా ఉందో ఊహించుకుని కాస్సేపు మైమరచి నవ్వుకోండి. అంకెలు శాస్త్రానికి సంకేతం కాని అంకెలిక్కడ కవిత్వానికి సంకేతమైనవి.

పరఁగగ నాల్గుపాదములు బాగుగ తుండము ఘీంకృతంబు మా
కిరువురకున్ సమంబెమఱి యెక్కువయొక్కటి పక్షయుగ్మఖే
చరుఁడను నాకు సామ్యమొక సామజమాయని దోమపల్కున
ట్లరయ మహానుభావులను నల్పుడు నోరికొలందులాడెడిన్.

లోకంలో కొందరుంటారు. వాళ్లకు తమలోతుపాతులు తెలియవు. తమ కెంతశక్తి, ఎంతపాండిత్యం, ఎంత సామర్థ్యం ఉన్నదో తెలియదు. అయినా తమను లోకం మహాపండితులుగా గుర్తించి గౌరవించదనీ, కొనియాడదని మనస్సులో బాధపడుతూ, ఆ బాధను అణచుకోలేక ఏవో సామ్యాలు చెప్పుతూ తాముా గొప్పవాళ్లమే అని చెప్పుకుంటూ తిరుగుతుంటారు. ఇది న్యూనతాభావం Imferiority complex ఈ భావమే వాళ్లతో అవాకులూ చెవాకులూ చెప్పి స్తుంది. తమ తమ రంగాలలో మహోన్నత సిద్ధులను సాధించిన మహిత కళా ప్రపూర్ణులకు ప్రజలందిస్తున్న ఆదరాభిమానాలను చూసి సహింపులేక మనస్సును మాత్సర్యానికి కుదువబెట్టి "మేం మాత్రం ఏంతక్కువ! ఆ మాటకొస్తే గొప్ప వాళ్లగా చెలామణి అవుతున్న వాళ్ళకంటె మాకే ఒండు రెండు గుణాలు ఎక్కువ గానే ఉన్నాయి. ఏదో గ్రహచారం చాలక ఇలా ఉన్నామే కాని మేము మాత్రం సామాన్యులమా?" అని ప్రగల్భాల బుద్బుదాలు ఎగురవేస్తుంటారు. ఇలాంటి వాళ్లల్లో కవులున్నారు రాజకీయవ్యక్తులున్నారు. అధికారులున్నారు. సాధకు లున్నారు బోధకులున్నారు.

నిజానికి ఎక్కడి దోమ, ఎక్కడి ఏనుగు, ఈ రెంటికీ ఉన్న వ్యత్యాసం ఇంతా అంతాకాదు. 'హస్తిమశకాంతరం' అన్నన్యాయమే పుట్టుకొచ్చింది. పద బంధంగా భాషలో చొరబారింది.

ఈ పద్యంలో ఒక దోమ వెలార్చిన బడాయి చోటుచేసుకున్నది.

దోమ అంటుందట, తనకూ, ఏనుగుకూ నాలుగు పాదాలు, తుండం, ఘీంకారం సమంగానే ఉన్నాయట. అంతేకాదు ఆ ఏనుగుకు లేని రెక్కలు తన కున్నాయట. ఆ రెక్కలతో అది ఆకాశంలో సంచరించగలుగుతుందట. అలాంటప్పుడు తనకూ ఆ ఏనుగుకూ పోలిక ఏమిటి ?

మహానుభావులను అల్పబుద్ధులు ఈ విధంగా నోటికి వచ్చినట్లు తూలనాడుతూ ఉంటారు మహానుభావత్వం, కృషివల్ల, తపస్సువల్ల లభిస్తుందేకాని ఒకరిలో లేని లక్షణాలనో, దోషాలనో ఎత్తిచూపడంవల్ల రాదు. ఇతరుల గొప్పతనాన్ని తెలుసుకోలేక అదుపు తప్పి మాట్లాడటం భావ్యంకాదన్న సత్యాన్ని కవితాత్మకంగా ఈ చాటుపద్యం చాటుతున్నది. ఈ పద్యంలోని చమత్కారం ఎప్పటికీ మాసిపోదు. లోకాన్ని తరచి చూస్తున్నకొద్దీ నిత్యసత్యంగా భాసిస్తున్నది. ఈ పద్యంలో దోమ ఒక మనస్తత్వానికి సంకేతం. ఏనుగు గాంభీర్యానికీ, నిండుతనానికీ, ఔన్నత్యానికీ సంకేతం.

ఈ పద్యాన్ని పలికిన కవి ఎవరో తెలియదుకాని ఒక చక్కని అనుభూతినీ, యాథార్థ్యాన్నీ, ఒక లోకంపోకడనూ, ఒక ప్రసిద్ధ న్యాయాన్ని నవ్విస్తూ చెప్పి ఎందరినో అలరించినాడు. ఎందరికో బుద్ధిచెప్పినాడు. చరితార్థుడైనాడు.

కవితాకన్యకు నలుగురు
కవిజనకుఁడు భట్టుదాది గణుతింపంగా
నవరసికుఁడె పెనిమిటి
యవివేకియె తోడఁబుట్టువనవేమనృపా! 5

14వ శతాబ్దంలో రెడ్డి ప్రభువులు కొండవీటినీ, అద్దంకినీ, రాజమహేంద్రవరాన్నీ, కందుకూరునూ రాజధానులుగా చేసుకుని తెలుగునేల నేలినవారు. రెడ్డి రాజులందరూ సంస్కృతాంధ్ర భాషలలో మంచి పాండిత్యాన్ని సంపాదించి గొప్ప గొప్ప రచనలు చేసి కవిపండితుల నెందరినో ఆదరించినారు. వారిలో అనవేమభూపాలుడు శేముషీసంపన్నుడు, వదాన్యుడు, పరాక్రమశాలి. అతనిని ఉద్దేశించి ఎవరో కవి చెప్పిన పద్యమిది. కవిత్వ విమర్శనారీతిని అవగతం చేసు

కోవడానికి, అనువైన పద్యమిది. పరిమాణంలో ఈ పద్యం చిన్నదైనా గుణంలో మిన్నులందుకున్నది. ఇలాంటి పద్యాలను విని ఆనందించి ''కందం వ్రాసినవాడే కవి'' అన్నమాట ప్రచారంలోకి వచ్చిందేమో !

కవితా కన్యకు తండ్రి కవి. భట్టుదాది. నవరస రసికుడే భర్త. అవివేకి తోబుట్టువు. ఈ పద్యాన్ని పదిలంగా మననం చేసుకోవాలె. సృజనంతోటే కవి బాధ్యత తీరిపోతుంది. ఇక ఆ కావ్యానికి అపార్థాది అరిష్టాలు రాకుండా దానిలోని గుణాలను పొగుడుతూ ప్రచారంతేసే సహృదయ సముదయం ఉండాలె. ఇక్కడ భట్టు అంటే కవిత్వంలోని గుణగరిష్ఠతను గ్రహించి పలువురికి చెప్పే వాడన్న మాట. మరి ఆ కవితలోని రసాత్మక భావంతో తాదాత్మ్యాన్ని చెందే రసికుడు భర్త. అంటే నవరసరుచిరమైన కావ్యాన్ని తన హృదయాధి దేవతగా సమ్మానిస్తున్న రసికుడే కావ్యరసానందానుభవానికి సమర్థుడు ఇక ఈ కవితా కన్యకు ఒక తోబుట్టువుకూడా ఉంటాడు వాడితో నలుగురు. ఆ తోబుట్టువు అవివేకియట. అంటే కావ్యం పుట్టిన తోడనే యుక్తాయుక్త విచక్షణ లేకుండా, శాస్త్రమర్యాదల పరిజ్ఞానం లేకుండా దొసగులనేరేరి కావ్యప్రసరణానికి అడ్డు తగులుతూ ఉంటాడతడు. లోకంలో తోబుట్టువుకు ప్రేమ సహజంగానే ఉంటుంది. కాని కావ్య ప్రపంచంలో అవివేకులనే అసూయాపరులు కావ్యానికి తోబుట్టువులుగా ఉండటం చాలా సహజంగా కనిపిస్తున్న అంశం. అసలు ఈ పద్యంలో ఉన్న చమత్కారమంతా ఇక్కడే ఉన్నది. అవివేకిఅంటే విచారణ చేయనివాడు. వివేకము లేనివాడు. ప్రౌఢత లేనివాడు. తోబుట్టువు అంటే ఇక్కడ కవి హృదయం జ్ఞాతిలేక పాలివాడు.అనే అర్థాన్నివ్యంజిస్తున్నది. ''జ్ఞాతిశ్చేదనలేన కిమ్మ''న్న సూక్తి అందరికీ తెలిసిందే కదా! పాలివాడుండగా కొంపలంటు కోవడానికి అగ్ని అక్కరలేదు. కవిత్వానికి ప్రబలశత్రువు అవివేకి అన్న యాథార్థ్యం ఈ పద్యానికి పరమార్థం

రాకవిధాత: యోరివినరా తగురా తలకొట్లమారి ని
స్సారపు లోభిరాజులనుఁజంపక మల్కిభరామ భూవరున్
జారుయశోధనున్ సుగుణిఁజంపితి వర్థులకేమిదిక్కురా
చేరిక నింతరాజులను సృజింపఁగ నీతరమా వసుంధరన్ ?. 6

క్రీ.శ. 1550 తరువాత దాదాపు తెలుగునేలనంతటిని గోలకొండను రాధానిగా చేసుకుని పరిపాలించిన ప్రభువు ఇబ్రాహింకులీ కుతుబ్‌షా. తెలుగు కవులు ఇతనిని 'ఇభరాముడు' అని కీర్తించిరి. పారసీ, అరబ్బీ భాషలలో చక్కని పాండిత్యాన్ని సంపాదించి అప్పుడప్పుడే వేళ్లు తన్నుకుంటున్న సరికొత్త భాష 'దక్కనీ'కి అంకురదశలో దోహదం కల్పించడమే కాకుండా. అప్పటికే సమృద్ధమైన తెలుగు భాషా సాహిత్యాలను పోషించిన సహృదయ వతంసుడు—అద్దంకి గంగాధరకవి 'తపతీసంవరణోపాఖ్యానం' ప్రబంధం ఆయనకు అంకితం చేసినాడు సామంతుడైన అమీన్‌ఖాన్ అనే ఒకసర్దారు పొన్నగంటి తెలగన్న చేత తెలుగులో మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యం 'యయాతి చరిత్రము'ను వ్రాయించి అంకితం పొందినాడు. 'వైజయంతీ విలాసమును' వ్రాసిన సారంగుతమ్మయ గోలకొండ ప్రభువుల ఆశ్రయంలో విలసిల్లినవాడే. తన మాతృభాష తెలుగు కాకపోయినా తెలుగుకవులను పోషించి తెలుగు కవితాలతకు పందిళ్లు వేయించిన ఆ రసికప్రభువు మహాదాత. అర్థుల పాలిటి కల్పవృక్షం. మల్కిభరాముని గురించిన చాటుపద్యాలు శతాధికంగా ప్రచారంలో ఉన్నవి. శ్రీరామునికంటె, పరశురాముని కంటె, గోపికారామునికంటె, అమరాధిపుకంటె, షట్చక్రవర్తుల కంటెను గొప్పవాడని ఆ ప్రభువును వేనోళ్ళ పొగిడిన చాటుపద్యాలు ఎన్నో ఉన్నవి. వాటినిక్కడ ఉదాహరించడం, వ్యాఖ్యానించడం కష్ట సాధ్యమేమీకాదు కాని గ్రంథవిస్తర భీతిచే వదిలి వేస్తున్నాను.

మల్కిభరాముని దానశౌండీర్యాన్ని పతాకంలా రెపరెపలాడిస్తున్న ఈ పద్యాన్ని మాత్రం ఉదాహరిస్తున్నాను.

జాతికి ఎంతో మేలుచేసి పాండిత్యంలో, త్యాగంలో, సౌశీల్యంలో, మిన్నులు ముట్టిన ఔన్నత్యాన్ని సాధించి, ప్రజల గుండెల్లో దేవతా స్వరూపుడుగా నిలిచిపోయిన ఒక మహా పురుషుని అస్తమయం ఎందరి హృదయాలనో కలచి వేస్తుంది. ఇంతటి వ్యక్తి ఇక మనకు మళ్లీ లభిస్తాడా ? పుట్టబోతాడా అని విలపిస్తుంది జాతి.

పుట్టినవాడు గిట్టక తప్పదు. ఇది వేదాంతం కాదు. విజ్ఞానం అయినా ఆత్మీయులు పోయినప్పుడు ఆదుకునే వాళ్లు పోయినప్పుడు పాండిత్యం కొన్ని

క్షణాలు మరుగున పడిపోయి అజ్ఞానం కమ్ముకుంటుంది. పండితునికీ, పామరునికీ భేదం ఉండదు.

మల్కిభరాముడు దివంగతుడైనాడు. యాచకులను ఆదుకునే రాజికలేడు. అందరూ లుబ్ధాగ్రేసర చక్రవర్తులే! ఒక కవికి గుండె మండిపోయింది. సృష్టికర్తనే సవాల్ చేసినాడు. "ఓయీ బ్రహ్మయ్యా! ఇటు రావయ్యా! ఒక మాట వినవయ్యా! నీవు తలకొట్ల మారివి"— బ్రహ్మకు అయిదు ముఖాలుండేవట. శివుని కోపానికి గురియై ఒక శిరస్సు ఛేదింపబడినదట. అప్పటి నుంచి ఆతడు చతుర్ముఖుడైనాడని పురాణగాథ.

"రసహీనులైన లోభిరాజులనుచంపక యశోధనుని సుగుణ, సంపన్నుని మల్కిభరాముని చంపితివి. ఇప్పుడు యాచకులకు ఎవరుదిక్కు? ఇంతటి యశోభి రాముణ్ణి. దానగుణాభిరాముణ్ణి మళ్ళీ నీవు సృజింపగలుగుతావా? ఈ భూమిలో అంతటి మహారాజును సృజించడం నీతరమా?" అని బ్రహ్మను దెప్పి పొడిచినాడు.

ఇంత స్ఫూర్తి ఉన్న పద్యం ఊరికేరాదు. మండుతున్న గుండెల సెగలను కక్కుతున్న, ఈ పద్యం, ఇభరాముని మృతినిగూర్చి వెలువడిన మాట నిజమే. ఒక యశోభిరాముడు దివికేగినప్పుడు దుఃఖం ఎలా పొంగి పొరలుతుందో, ఎలా దైవాన్ని ప్రశ్నిస్తుందో తెలుపగలుగుతున్నది.

ధీరోదార గుణంబులు
కారణజన్మునకు వేఱే కరపగవలెనా?
ధారుణిలోఁ టెంకాయకు
నీరెవ్వరు పోసిరయ్య నిట్టల హరియా?

ఈ పద్యం నిట్టల హరిహరప్ప అనునతడు వ్రాసెనని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఉదాహరించినారు. ఈ నిట్టల హరిహరప్ప ఎప్పటివాడో తెలియదు.

ధైర్యం, ఔదార్యం అనేగుణాలు జన్మతః మనిషికి అబ్బుతాయి. టెంకాయలో నీరెంత సహజంగా పుట్టుకొస్తుందో, ధైర్యం, ఔదార్యం అనేగుణాలు

కూడా పుట్టుకతోనే వస్తాయి. నేర్పుతో వచ్చేవికావు. ఇట్లాగే కవిత్వం కూడా. కొన్ని విద్యలు సాముగారిడీలవల్ల, సాధన వల్ల వస్తాయేమో కాని, సాహిత్యాది విద్యలబ్బవు. అనేక శాస్త్రాలు చదువుకున్న వానికి కూడా ఔదార్యాది సహజ గుణాలు రావు. సౌశీల్యాన్ని గూర్చి, పారమార్థికాంశాలను గూర్చి శక్తిమంతంగా, ప్రసంగించే 'మహానుభావు'ల దైనందిన జీవితాన్ని పరికిస్తే,వాళ్ళకు నమ్మకం లేని విషయాలనే వాళ్ళు ప్రబోధిస్తున్నట్లు తెలియవస్తుంది. మనసుకు, మాటకు, చేతకు సమైక్య స్థితిని కల్పించగలిగిన మహామహులు యుగానికి ఒకరో, ఇద్దరో! శంకరభగవత్పాదులు, శ్రీమద్రామానుజులు, గాంధీమహాత్ముడు, అబ్రహాంలింకన్, వివేకానందస్వామి ఇట్లా కొందరే మనకు చరిత్ర పుటల్లో సాక్షాత్కరిస్తారు.

మహాభారతంలో ఉందోలేదో కాని ఒకకథ కర్ణుని ఔదార్యం గురించి ప్రచారంలో ఉన్నది గీర్వాణాంధ్రా ద్యత్యష్టభాషావిదులు,'ఆంధ్ర బిల్హణులు' కీ.శే. కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి వల్ల ఈ కథ నేను విన్నాను.

ఒకప్పుడు ధర్మరాజు కృష్ణుడితో అన్నాడట "నాకు దానం చెయ్యాలని ఉన్నది. కాని ద్రవ్యాభావంవల్ల చెయ్యలేక పోతున్నాను." అప్పుడు కృష్ణుడు కొన్ని గదులనిండా బంగారు నాణెములను సృష్టించి "ఇక యాచకులకు పంచి పెట్టు" అన్నాడట. వచ్చిన యాచకులకంతా ధర్మరాజు ఇస్తున్నాడు. భీముడు రెండు మూడు చేటలనిండా నాణెములను తెచ్చి ఇస్తున్నాడు ఒక్కొక్క యాచకునికి. భీముడు అలసిపోయాడు. ధర్మరాజుకు ఓపిక తగ్గిపోయింది. ఇంకా చాలా నాణేలు మిగిలిపోయినవి. అస్తమయమైంది. మర్నాడు కృష్ణుడు అక్కడ ధర్మరాజుకు బదులుగా కర్ణుణ్ణి కూచోమన్నాడు. ఎవ్వడో యాచకుడు వచ్చి "నేను యజ్ఞం చెయ్యాలనుకుంటున్నాను కొంత ధనం ఇప్పించండి" అన్నాడు. అప్పుడు కర్ణుడు "ఈ గదుల్లో ఉన్న నాణేలన్నింటినీ తీసుకుపో" అని చెప్పి చేతులుదులుపుకునికృష్ణునితో చెప్పివెళ్ళిపోయినాడు. అప్పుడు ఔదార్యం అంటే ఏమిటో అది ఎంత సహజంగా ఉంటుందో ధర్మరాజుకు వివరించినాడు.

ధైర్యం, తెంపు, త్యాగం లెక్కలకు లొంగేవికావు. పరిస్థితుల ఆనుకూల్యాలకు, ప్రాతికూల్యాలకూ సరిపడేవికావు. తర్కవితర్కాలకూ, ధైర్యాదా

ర్యాలకూ చుక్కెదురు. ముందు వెనుకలు చూడడు సాహసికుడు. అలాంటి సాహసికులే సావర్కర్, భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, ప్రకాశం, అల్లూరి. వీళ్ళు మన స్వాతంత్ర్య సమర చరిత్రలో రక్తాక్షర కాంతులతో మెరుస్తున్న నక్షత్రాలు మన ప్రాచీన భారతేతిహాసంలో పురుషోత్తముడు, రాణాప్రతాప్, శివాజీ, ఝాన్సీ లక్ష్మిబాయి, వంటివారు ఎందరో ఉన్నారు.

అన్నాతిఁ గూడ హరుఁడగు
నన్నాతినిఁగూడకున్న నసురగురుఁడౌ
నన్నా! తిరుమల రాయఁడు
కన్నొక్కటిలేఁదుగాని హతుఁడెగాఁడే. 8

తెగిడినా, పొగిడినా చాటుపద్యం తీరేవేరు పురాణపురుషులు కూడా చాటుపద్యాల్లో ఒదిగిపోతారు. చాలా చమత్కారంగా ఒదిగిపోతారు. ఆ లోకంలోని దేవతామూర్తులు. ఈ లోకంలోని పురుషులతో సమైక్యమైపోతారు. ఎదుటివాణ్ణి నిజానికి పొగిడినట్టుగా ఉంటుందిగాని, ఆ పొగడ్తలో హాస్యం చెట్ట పట్టాలు పట్టుకుని నడుస్తుంది. పొగడ్తలు పొందే వాని దోషాలన్నీ గుణాలై పోతాయి. ఎంతటివాణ్ణి అయినా పొగిడి బుట్టలో వేసుకోవచ్చు. బుట్టలో వేసుకుని తమ తమ పనులు సజావుగా సాగించుకునే తెలివితేటలున్నవాళ్లు ఎప్పుడూ లోకంలో ఉంటూనే ఉంటారు. పొగడ్తకు లొంగని వాడెవడు? పరమశివుడు పొగడ్తకు పరవశించి ఇయ్యరాని, ఇయ్యకూడని వరాలను ప్రసాదించిన గాథలు మనకు తెలియనివికావు. అసలు పొగడ్త కొందరికి బ్రతుకుదెరువు. ఎవరు అధికారంలో ఉంటేవాణ్ణి పొగిడి పబ్బం గడుపుకునే ఘటాలను మనం దైనందిన జీవితంలో చూస్తూనే ఉన్నాము.

తిరుమలరాయడు తెనాలి రామలింగని పిలిచి తనను పొగడమన్నాడట. అయితే ఆ పొగడ్త సహజంగాఉండాలనీ, గోరంతదాన్ని కొండంత చేసి చెప్పకూడదన్నాడట. స్వభావసిద్ధంగా శ్లాఘించమన్నాడట. రామలింగడు మాత్రం సామాన్యుడా?

ఆ తిరుమలరాయడు ఒంటికంటివాడు. సహజంగావర్ణిస్తే ఎంత భీభత్సంగా ఉంటుంది? మహాకవులకు సాధ్యంకానిదేముంటుంది?

తిరుమలరాయడు భార్యాసమేతుడైతే శివుడే. భార్య లేకపోతే రాక్షసుల గురువైన శుక్రాచార్యుడే. కన్ను ఒక్కటి లేదుగాని అతడు మన్మథుడు కాడా అని వర్ణించినాడట రామలింగడు.

శివునికిమూడుకన్నులు. భార్యాసమేతుడైన తిరుమలరాయనికి ఒకకన్ను అతని విర్యం రెండు కన్నులు కలిస్తే శివుడౌతాడు. భార్య లేదనుకులదాం. ఒంటికంటి శుక్రాచార్యుడౌతాడు. కన్నొక్కటేలేదు. కాని తిరుమలరాయడు సాక్షాత్తూ మన్మథుడే. ఒక కన్నులేనివాణ్ణి ఈ తీరుగా పొగడటంలో ఎంత గమ్మత్తుందో? ఇంత సున్నితంగా ఈ పద్యం చెప్పినాడు కవి. కాని ఒంటికంటి వానిముందు ఈ పద్యం చదివితే తనను ఆటబట్టించడానికి, ఎక్కిరించడానికి అనుకుంటాడు. పద్యంలో అవహేళన ఏమీలేదు. కాని అవహేళన భాసిస్తుంది. పొగిడే తీరులో ఎంత నేర్పు? కవిత్వమో? కొంటెతనమో? చమత్కారమో?

బాలరసాలసాల నవపల్లవ కోమలకావ్యకన్
కూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమకందమూల కౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై. 9

ఈ పద్యం శ్రీ మహాభాగవతాన్ని తెలుగులో రచించిన బమ్మెరపోతనామాత్యునిదని ప్రతీతి. పోతన పద్యం ఒక్కటి కూడా రానివాడు పూర్తిగా తెలుగువాడు కాడు. తెలుగు కవిత్వానికీ, తెలుగు పద్యానికీ నాదసుధలందించిన అరుదైన కవిపోతన్న. అర్థంకాకపోయినా ఆయన విశిష్ట పదప్రయోగంవల్ల కలిగే అందం చిత్తాలను ఆకట్టుకుంటుంది. సంస్కృతంలోని పురాణాలు, కావ్యాలు, ఇతిహాసాలు తెలుగులోకి వచ్చినప్పుడు రకరకాల కత్తిరింపులకు గురియైనవి. కాని వ్యాసుని భాగవతంకంటే పోతన భాగవతం పరిమాణంలో పెరిగింది. తెలుగు సాహిత్య చరిత్రలో ఇది వింతలలో వింత. భక్తి పారవశ్యంతో

ఆ మహితాత్ముడు వ్యాసుడు చేసిన వర్ణనలను ఎన్నింటినో చేసినాడు. శ్రీధర పండితుడు వ్యాసభాగవత శ్లోకాలకు వ్రాసిన వ్యాఖ్యానాలు కూడా పద్యాలై పోయినవి పోతన భాగవతంలో. పోతన నాదసౌందర్యంవల్లనో, భక్తి భావబంధురతవల్లనో, అతిపవిత్రమైన ఆయన వైయక్తిక జీవనంవల్లనో, భాగవత కావ్యానికి లభించిన జనప్రియత్వం మరే ప్రాచీనాంధ్రకావ్యానికి రాలేదు. పోతన భాగవతంతో పరిచయం, సహజంగా సంగీతాత్మకమైన, తెలుగుభాషతో పరిచయం

'ధరణీనాథు (ధనమదాంధు) లకొలువేల తాపకులకనీ,' తృప్తిని మించిన ధనము, భక్తిని మించిన మోక్షసాధనము లేదనీ, త్రికరణ శుద్ధిగా నమ్మిన ఆవంధ్యజీవనుడు పోతన. నిరీహుడై, నిస్సంగుడై, సంసార జంబాల పటలం నుంచి తప్పించుకుని తిరిగే కేవల సన్యాసి కాడతడు. కవిత్వంవ్రాసే వాణ్ణి ఎవడో పోషించాలనీ, శ్రామిక జీవితానికి తిలోదకాలిచ్చిన బాధ్యతారహితుడు కాడతడు. రాజులను, శ్రీమంతులను ఆశ్రయించి వాళ్లకు తన కావ్యాలను అంకితం చేసి, ధన ధాన్యాదులతో తులతూగటం పోతన్న దృష్టిలో మహాపాపం. తన భార్యను బిడ్డలను పోషించుకోడానికి సత్కవులు తమ కావ్యాలను దుర్మార్గులకు అంకితం చేయవలసిన అవసరం లేదని నమ్మినవాడు.

లేతమామిడి మొక్క కొమ్మకు, కొత్తగా పుట్టుకొచ్చిన చివుళ్లవలె అతి కోమలంగా ఉన్న కావ్యకన్యకను దుర్మార్గులకు అప్ప చెప్పి వాళ్ల దయవల్ల దొరికే ఆ పడుపు కూడుతిన్న దానికంటే, ఉత్తమకవులు అడవుల్లో దొరికే కంద మూలాదులను త్రవ్వి తీసుకుని తిని బ్రతకడం శ్రేయస్కరం. లేకపోతే పొలం దున్నుకుని పంట పండించి తనను, తన పిల్లలను పోషించుకోవాలె. అంతే కాని తాను సంఘానికి భారం కాకూడదు. తన ప్రతిభ అమ్ముడు పోయే వస్తువు కాకూడదు. ఆ మాత్రం స్వాభిమానం కవికి ఉండాలె. అప్పుడే అతడు వ్రాసిన కవిత్వంలో స్వేచ్ఛ ధ్వనిస్తుంది. కాయకష్టం విలువను కాదన్నవాడు కవి అయితేనేమి? కాకపోతేనేమి? హాయిగా పట్టుపరుపులపై కూర్చుని రకరకాల సేవలు పొందుతూభోగభాగ్యాలతో తులతూగుతూ, గజదంత గోపురాల్లో కలాలకు పనిచెప్పే కవులకు ప్రజాసామాన్యం సంగతి తెలుస్తుందా? ప్రజల్లో తానూఒకడై ఉంటేనేగాని ప్రజాహితమైన కవిత్వం వెలువడుతుంది. అతడు ప్రజాకవి అనిపించుకుంటాడు. భార్య బిడ్డల ను పోషించుకోలేనివాడు. సంసార బాధ్యతలను

ఎవడో తీర్చాలనుకునే వాడు వ్రాసే కవిత్వానికి కాలదోషం పట్టి తీరుతుంది. తాను శ్రమించకుండా శ్రమ జీవుల కోసం కవిత్వం వ్రాస్తున్నాననుకునేవాడు శ్రమ జీవుల బ్రతుకు బరువులకు విలువ కట్టలేడు. వాళ్లకోసం పాటుపడలేడు. ఎడారిలో ఉండి నీళ్లక్కరలేదనడం ఏమంత పెద్దవిషయం కాదు. తీయతీయని నీళ్లు పారుతున్న సెలయేటి గట్టున కూర్చుని నీళ్లు తాగనంటే అది ధైర్యం. అది నిగ్రహం. ప్రపంచాన్ని వదిలి ఎక్కడో అడవుల్లో ముక్కుమూసుకుని కూర్చునేవాడు. సాధించుకునే ముక్తి కేవలం వైయక్తికం సమాజానికి ఆ తపస్సుతో పనిలేదు. 'నేను కవిని నేను వ్రాయగలనే కాని కష్టించిపని చేయడం నా వల్ల కాదనేవాడు శ్రమ జీవనాన్ని గురించి ఎంత చక్కని కవిత్వం వ్రాసినా ఎవడూ పట్టించుకోడు.

"మద్యపాన నిషేధాన్ని గూర్చి కవిత్వం వ్రాయాలంటే నాకు ఉత్సాహం కలగాలె. ఉత్సాహంకోసం మంచి మద్యం అందిస్తేనేకాని నా కలం నుంచి కవిత్వం జాలువారదు" అన్న కవి రచన మద్యపానాన్ని ఆపలేదు. తనకే నమ్మకంలేని సిద్ధాంతాలను లోకానికి ఎంతఅందంగా చెప్పడానికి ప్రయత్నించినా ఆత్మవంచనే అవుతుంది.

అలాంటి ఆత్మవంచనకు గురికాకుండా పోతన గోమాతనూ, భూమాతనూ నమ్మి తన బ్రతుకు బరువులను ఈడ్చుకుంటూ పరాశ్రయాన్ని తృణీకరించి మానవోత్తమునిగా జీవితాన్ని మలచుకున్నాడు. దేవుడే తనను కావ్యం వ్రాయమన్నాడట. ఆ దేవునికే కావ్యాన్ని అంకితం చేసినాడట.

దాదాపు ఐదువందల ఏండ్ల క్రితం కర్కశులైన రాజులు తమ పరిపాలన నిరంకుశంగా, విశృంఖలంగా సాగిస్తున్న రోజులలో వాళ్లు తన కావ్యాన్ని అంకితం చేయమని కోరినా నిర్భయుడై ఆ రాజులను ఎదిరించినాడు. ఆ కాలంలోనే రాజులను 'మనుజేశ్వరాధములు' అనగలిగిన సాహసికుడతను. వాళ్లకు కావ్యం అంకితం చేస్తే ఇహలోకంలో సుఖం దొరుకుతుందేమోకాని, జీవితయాత్ర ముగిసిన తరువాత యముని శిక్షకు గురి అవుతారని ప్రకటించజాలిన ధీశాలి అతడు.

అందుకే అన్నారు విశ్వనాథవారు పోతననుగూర్చి—

"పోతన తెలుగుల పుణ్యపేటి" అని

ఈ చాటు పద్యం ఉత్తమకవికుండవలసిన లక్షణాలను వ్యంజిస్తున్నది. కర్మయోగానికీ, జ్ఞానయోగానికి చక్కని సమన్వయాన్ని ప్రతిపాదించ గలుగుతున్నది. ప్రాచీన కవులందరూ రాజాశ్రయానికి అర్రులుచాచి తమవ్యక్తిత్వాన్ని చంపుకున్నవాళ్లని అనుకోవడం అన్యాయం. అజ్ఞానం. తిక్కన్నకవిత్వాన్ని భగవదారాధనా విశేషంగా నమ్మినవాడు. ప్రాచీనాంధ్ర మహాకవులెందరో తమ కావ్యాలను పరమేశ్వరునికి అంకితంచేసి పునీతులైనారు.

కళను స్వార్థంకోసం ఐహికసుఖంకోసం బలిపెట్టిన వాళ్లు నాడూ ఉన్నారు. నేడూ ఉన్నారు. ప్రాచీన సాహిత్యమంతా ప్రజలను పెడదారి పట్టించిందని అషామాషీగా ప్రచారం చెయ్యటం కంటె పోతనసాహిత్యాన్ని, అన్నమయ్య సాహిత్యాన్ని, త్యాగయ్య సాహిత్యాన్ని వేమన పద్యాలను చదివే ఓపికను సంపాదించుకుంటే మంచిది. అచ్చమైన సాహిత్యంలో పాతకొత్తలను వింగడించడం అంతంత మాత్రాన అయ్యేపని కాదు.

పోతన చాటువుకాదుకాని, ఈ క్రిందిపద్యం అందరికీ తెలిసిందే కాని పోతన ఎంత మహోత్తాలమైన ఆదర్శశిఖరాలు అందుకున్నాడో ఆయన అంత పాతకాలం వాడైనా, ఎంత కొత్త వాడుగా కనిపిస్తున్నాడో తెలుపగలుగుతున్నది.

"చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు"

స్థాన విశేషమాత్రమునఁ దామరపాకున నీటిబొట్టు నిన్
బూనికి మౌకంబనుచుఁ బోల్చిన మాత్రన యింతగర్వమా,
మానవతీ శిరోమణులు మాలికలందునఁ గూర్పవత్తువో!
కానుక లీయవత్తువో! వికాసమునిత్తువో! విల్వదెత్తువో!

ఎవరిదో ఈ పద్యం కాని ఎంత వ్యంగ్యార్థాన్ని పొదుగుకున్నది? అన్యాపదేశంగా చెప్పిన ఈ చాటుపద్యం అచ్చమైన కవితకు లక్ష్యం. ప్రతిభాహీనులు.

అసమర్థులు, అవ్యుత్పన్నులు, కుసంస్కారులు ఒక్కొకసారి అదృష్టవశాత్తూ కనకసింహాసనం మీద శునకంలా కూర్చుంటారు. సింహాసనం మీద కూర్చున్న వాడు రాజే! కాని ఒక్కొకసారి రాజులాంటివాడు కూచుంటాడు. వేదంవారి 'ప్రతాపరుద్రీయ' నాటకంలో పేరిగానిలా ప్రతాపరుద్రచక్రవర్తి అవుతాడు.

పండితుల మధ్య కూర్చున్నంత మాత్రాన ఎవ్వడూ పండితుడు కాడు. ధర్మానువర్తుల మధ్య కూర్చున్నవాడు ధార్మికుడు కాడు. పెద్ద పెద్ద సాహిత్య సాంస్కృతిక సంస్థలలో ఎన్నికల తంతు పుణ్యానా ఎందుకూ పనికిరానివాడు ఎన్నికై పండితుల మధ్య కూర్చుని తానుకూడా పండితుణ్ణనే గర్వంతో విర్ర వీగుతూ మహాప్రజ్ఞావంతులపట్లకూడా అప్రజ్ఞాకరంగా ప్రవర్తిస్తాడు. ఇలాంటి వాళ్లు అన్ని కాలాల్లోనూ, అన్ని రంగాల్లోనూ ఉంటారు. నిజానికి ఇలాంటివాళ్ల కున్న విలువ ఏ పాటిది ?

నీటిబొట్టు నుద్దేశించి అన్యాపదేశంగా చెప్పిన ఈ పద్యం గాజుపూసలు, మణిపూసలుగా చెలామణి అవుతున్న సందర్భాన్ని చమత్కారంగా చెప్పుతున్నది. ఓ నీటిబొట్టూ! నీవు తామరాకుమీద ముత్యంలా మెరుస్తున్నావు. నీవు మరెక్క డున్నా నీకా పోలిక వచ్చేదికాదు. ముత్యంలా ఉన్నావని ఎవడో కవి నిన్ను పోల్చినంత మాత్రాన ఇంత గర్వమా? సుందరీమణులు అలంకరించుకునే హారాలలో కూర్చడానికి నీవు పనికివస్తావా ? కానుకలివ్వడానికి ఉపయోగపడతావా ? కాంతులను వెదజల్లగలుగుతావా ? విలువను ప్రసాదించగలుగుతావా ? నీవు నిజంగా నవరత్నాల్లో మౌక్తికానివి అవుతావా ? ఎందుకొచ్చిన గర్వమిది. నీవు నిజానికి మౌక్తికానివి కావు. తామరాకుపై నిలిచినందుకు స్థానవిశేషం చేత నీవు ముత్యంలా కనిపిస్తున్నావేకాని, ఎందుకూ పనికిరానిదానివి.

సరిగ్గా ఇలాంటిదే మరో చాటుపద్యం ఉంది. కాని ఇది ఒక పువ్వు నుద్దే శించి చెప్పింది. కొంత గడుసుదనం ఉన్న పద్యం ఇది. కొంత ప్రకృతి సౌంద ర్యాన్ని పుక్కిలిస్తున్న పద్యమిది వెన్నెలను ఎంత చక్కగా కవి ఈ పద్యంలో వర్ణించినాడో అంత చక్కగా ఒక వ్యర్థమైన వస్తువు ప్రాముఖ్యాన్ని సంపాదించు కోవడాన్ని అంత వ్యంగ్యస్ఫూర్తితో అభివర్ణించినాడు. ఇందులో వెన్నల చల్ల దనం ఉన్నది. తన ప్రతిభకు తగిన గుర్తింపు రాలేదని ఒక మానవుని గుండెల్లో

రగుల్కొన్న చిచ్చున్నది. అయితే ఈ పద్యంలో ఆ కవి నిప్పులు కక్కలేదు. ఢమఢమార్భాటాలు చేయలేదు. మెత్తగా ముద్దుగా మందలించినాడు. తన సరస తను చవిచూపినాడు.

ఇదిగో ఆ పద్యం—

వారక యీశ్వరుండు తలపై ధరియించిన యంత మాత్రన
వ్వారిజ వైరితోడ సరివత్తువెయుమ్మెతపూవ! నీపసనన్
వారిధులుబ్బునా! దెసలు వన్నెలు దేరునా! చంద్రికాంతముల్
నీరవునా, చకోరముల నెవ్వగ దీరునో తాపమూఉనో; ॥

ఎవడో శివభక్తుడు శివుని తలపై ఉమ్మెత్తపూవును భక్తితో ఉంచినాడు. ఉమ్మెత్త పూవు తెల్లనిది. చంద్రునిలా తెల్లనిది. శివుడు తన తలపై ధరించినంత మాత్రాన నిన్ను నీవు చంద్రుణ్ణి అనుకుంటున్నావా? నీవా చంద్రునితో పోల గలవా? చంద్రుని కాంతితో సముద్రాలుప్పొంగినట్లు నీ కాంతితో పొంగుతాయా? దిశలన్నీ వెన్నెలలతో వెలిగినట్లు నీ తెల్లదనంతో వెలుగుతాయా? శశికిరణ స్పర్శతో చంద్రకాంత శిలలు చెమ్మగిల్లినట్లు, నీ తెల్లని రంగుతో నీరవుతాయా? వెన్నెలను పానంచేసి తమ దప్పికనూ, తాపాన్నీ చకోరపక్షులు తీర్చుకుంటాయి. మరి నీవు ఆ చకోరాల దాహాన్ని తీర్చగలవా? ఎంత తాపమున్నా వెన్నెల దానిని ఉపశమింపజేసి శైత్యాన్ని ప్రసాదిస్తుంది. చల్లదనాన్ని వెదజల్లుతుంది. మరి నీ సంగతి? శివ జటాజూటంలో చోటుచేసుకున్న ఉమ్మెత్త తెల్ల తెల్లగా ఉన్నంత మాత్రాన చల్ల చల్లగా ఉన్న చంద్రునితో సరితూగగలుగుతుందా? సంఘంలో అధికారస్థానమే గొప్పదికాదు. ఆ అధికారాన్ని నిలబెట్టుకునే సామర్థ్యం ఉన్నప్పుడే అది రాణిస్తుంది. అధికారంలో ఉన్నవాళ్లు తమకు స్నేహితులని చెప్పుకుంటూ పబ్బాలు గడుపుకునేవారందరూ ఈ పద్యంలో ఉమ్మెత్త పూవుల్లాంటివాళ్లు. అక్రమంగా అధికారాన్ని హస్తగతం చేసుకున్నవాళ్లు. ఈ పద్యంలోని ఉమ్మెత్త పూలు. నిజానికి శివుని జటల్లో ఉన్న ఉమ్మెత్త పువ్వు జాబిల్లి కానట్టే విద్వత్సభల్లో కూర్చున్న మూర్ఖుడు ఈ పద్యంలోని ఉమ్మెత్త పువ్వుకూడా పండితుడుకాడు

'ఎవ్వడవీవు కాళ్లు మొగమెఱ్ఱన?' 'హంసను!' నెందునుందువో?
'దవ్వుల మానసంబునను', 'దాని విశేషములేమి?' తెల్పుమా?
మవ్వపు గాంచనాబ్జములు మౌక్తికముల్ గలవందు; 'నత్తలో'
'యవ్వియెఱుంగ, న'న్న 'నహహా' యని నవ్వెబకంబు
లన్నియున్. 12

ఒక సరస్తీరంలో కొంగల గుంపు. అక్కడికి ఒక హంస వచ్చింది. కొంగలు ఆ హంసను అడిగినవి.

"ఎవడవయ్యా నీవు ? మాలాగా ఉంటూనే, మాలాగా కనిపించడం లేదు. నీ కాళ్లూ, ముఖమూ ఎర్రగా ఉన్నాయే?"

"నేను హంసను"

"ఎక్కడుంటావు ?"

"ఇక్కడికి చాలాదూరం, మానస సరోవరంలో"

"ఆ సరోవరం విశేషాలేమిటో చెప్పవా మాకు ?"

"అందమైన బంగారు పద్మాలూ, ముత్యాలూ ఆ సరస్సులో ఉంటాయి."

"మరి నత్తలు"

"అవేవో నాకు తెలియదు."

ఈ మాట విని బకములన్నీ పకపకా నవ్వినాయట. కొంగలకూ, హంసకూ నడుమ జరిగిన సంభాషణ ఈ పద్యంలో మనకు పైకి వినిపిస్తున్నది. కాని మన మనస్సులకు వినిపించే మాటవేరు అర్థంవేరు. కవి మనకు చూపిస్తున్న గుంపు కొంగల గుంపుకాదు. మనలో కొంగల్లాగా బ్రతుకుతున్న, ఆలోచిస్తున్న కొందరు మనుష్యుల గుంపు.

ప్రజలకవి వేమన్న "పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా" అన్నాడు. అట్లాగే నత్తలను పట్టి తిని బ్రతికే కొంగలకు కాంచనపద్మాలు, మౌక్తికాల విలువ ఏం తెలుసు ? సముద్రంలో ఎన్ని నీళ్లున్నా మనచేతిలోని కడవలోకి ఎన్ని నీళ్ల రావాలో అన్నే వస్తాయి. మనకు అలవడిన సంస్కారాల సహాయంతో

మనం ఇతరుల సంస్కారాలను తెలుసుకోగలుగుతాము. మనకులేని తెలివి ఇతరులకు కూడా లేదనుకోవడం భ్రమ. నత్తలులేని కొలను ఏమంత గొప్పది? అని మానస సరోవరాన్నే గేలిచేసిన కొంగల్లాంటి మనుషులు మన సంఘంలో అన్నిరంగాల్లోనూ ఉన్నారు. రాజకీయాల్లో, సాహిత్య కార్యకలాపాల్లో, ఇంట్లో, అన్ని దేశాలలో గొప్పగొప్ప పనులుచేసి మహామనీషులుగా ప్రసిద్ధి పొందిన వారి జీవితాలలో ఏవోకొన్ని. అంతగా పట్టించుకోవలసిన అవసరం లేని అంశాలను తీసుకుని అవహేళన చేసి తృప్తిపొందుతూ ఉంటారు. వాళ్లనుద్దేశించి చెప్పిన పద్యం ఇది.

కొంగలు, హంస, మానస సరోవరం, మౌక్తికాలు అన్నీ ప్రతీకలే ఈ పద్యంలో. ఒక విలక్షణమైన మనస్తత్వ పరిశీలకుడెవడో ఈ కవి అందంగా, సున్నితంగా, ఎత్తిపొడిచి ప్రజ్ఞాచక్షువులతో చూడగలిగిన కవి మాత్రమే సత్యాన్ని, వ్యంగ్య స్ఫూర్తితో చెప్పగలుగుతాడని నిరూపించగలిగినాడు.

ఈకలు నల్లనైనవని యెంచి విశాల రసాల శాఖను
త్వేకము తోడ నెక్కి వికసించి ఫలంబుల నీవు మేయుచున్
గోకిలరీతి నుందుననుకొన్నను నుంటివిగాక! పాపపుం
గాకను! నీకు తన్మధురగానము కల్గునే ఎన్నిపల్కినన్. 13

కోకిల నల్లని రెక్కలున్నపక్షి. కాకి అలాంటిదే. కాకి మామిడిచెట్ల కొమ్మల్లో కూర్చుని చాలా ఉత్సాహంతో చివుళ్లనూ, ఫలాలనూ తింటూ తానూ కోకిలనీ అనుకున్నదట. కాని 'ఓ పాపి వాయసమా! నీకు ఆ కోకిలకున్న గాన మాధుర్యం ఉన్నదా ? నీవెంత మాట్లాడినా, నీవెన్ని కూతలు కూసినా, కోకిల వలె నల్లని రెక్కలున్నంత మాత్రాన కోకిలవు కాలేవు. 'కోకిలవలె మామిడి చివుళ్లు తింటున్నాను కనుక కోకిలను అనిపించుకోవాలె' అనుకోవడం దురాశ మాత్రమే కాదు. పాపంకూడా. వేషం వేసుకుంటే భాష మారుతుందా? ''తలలు బోడులైన తలపులు బోడులా'' అన్న వేమన్న సూక్తికి ఇక్కడ చక్కని చెల్లుబాటున్నది. బాహిరంగా ఎన్ని అలంకరణలు చేసుకున్నా, అంతరంగం ఎదగకపోతే, నలుగురినీ మోసపుచ్చడమే అవుతుంది. ఇది ఆత్మవంచన అవుతుంది.

దొంగ సన్యాసులంతా ఈ కోవలోకి వస్తారు. 'నీతిచంద్రిక'లో ఆషాఢభూతి ఈ వరుసలోనివాడే, పేదల కోసం కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నట్లు నటించి మేడలు కట్టుకున్న మహనీయులు 'పైన పటారం లోన లొటారం' గాళ్లే. వేషంలోగాదు పరివర్తనం. ప్రవర్తనలో పరివర్తనం. అదే ఉత్తమ సంస్కారం. ఈ చాటు పద్యం చాటుతున్న ఆదర్శం ఇదే. 'ఆషాఢభూతులున్నారు అక్కడక్కడ' జాగ్రత్త అని హెచ్చరిస్తున్నదీ పద్యం.

'ఘూంగట్ కేపట్ ఖోల్, పియామిలేంగే' అంటుంది మీరాబాయి. ముసుగును తొలగించు. భగవంతుడు కనిపిస్తాడు. అంటే బహిర్వేషాన్ని పరిత్యజించు. బూటకాలకు, బూకరింపులకు దూరంగా ఉండు, నాయకునిలా వేషం వేసుకుంటే సరిపోదు. ప్రజాహితాన్ని సాధించే త్రికరణశుద్ధి అవసరం. దొంగనోటు చెల్లనట్టే, దొంగ వేషం చెల్లదు. స్థూల దృష్టికి కాకి, కోకిల ఒకే రూపంగా కనిపిస్తాయి. వసంతకాలం వస్తే కూతనుబట్టి చెప్పవచ్చు. ఏది కోకిలో, ఏది కాకియో! వేషం వేసుకుంటే సరిపోదు. పరీక్షాసమయం వచ్చినప్పుడు నిగ్గుదేలుతాడు. అంతఃపురంలో ఉత్తరకుమారునికీ, యుద్ధభూమిలోని ఉత్తరకుమారునికీ ఎంత భేదం ? కాకిని దృష్టిలో పెట్టుకుని చెప్పిన ఈ చాటుపద్యం సంఘం లోతుల్లోకి పోయి చూడగలిగే ఎక్సరే కన్నులున్న కవిది. చాలా తమాషాగా ఉంది. కాని వేషగాళ్లను ఎడా పెడా వాయిస్తున్నది. చాటుపద్యానికి ఎంత స్ఫూర్తి ఉంటుందో, ఎంత అర్థ విస్తృతి ఉంటుందో ఎంత అంతరార్థం ఉంటుందో, తెలియచెప్పగలుగుతున్నదీ పద్యం.

> విధి సంకల్పముచే నొకానొకడు తా విశ్వంబు పాలించుచో
> బధిరం బెక్కువ చూపు తక్కువ సదాభాషల్ దురుక్తుల్ పనో
> వ్యధతో మత్తతతోడ దుర్వ్యసన దుర్వ్యాపారతన్ జెందు న
> య్యధికారాంతమునందు చూడవలదా!యాయయ్యసౌభాగ్యమున్

రాజులున్న కాలంలో పుట్టిన పద్యమే అయినా ఈ నాటి ప్రజాస్వామ్య వ్యవస్థలో కూడా దుష్పరిపాలకుల అధికార వ్యామోహం, సంస్కార హీనులు విధి సంకల్పంతో అధికారులు దురుసుగా వ్యవహరించడం, అధికారం అంతరించి పోయిన తరువాత గవ్వకు సాటిరాని బ్రతుకు బ్రతకడం మనం చూస్తూనేఉన్నాము.

అన్ని కాలాలకూ వర్తించే సత్యం ఈ పద్యానికి ఆత్మ. ఆత్మ అనిత్యమైనట్లే, సత్యం నిత్యమైనట్లే ఈ పద్యం కలకాలం నిలిచి ఉంటుంది.

చక్కని సంస్కారం, విద్య, దక్షత ఉన్న వానికే అధికారం దక్కాలె. అయితే ఒక్కొక్కసారి ప్రజల దురదృష్టం ఒకానొకడు విధిసంకల్పంతో ఏలకౌతాడు. లేదా అధికారి అవుతాడు. అప్పుడతనికి బధిరత్వం అంటే చెవిటితనం వస్తుందట. ఇక్కడ చెవిటితనం అంటే తనకిష్టమైన మాటలే వినపడటం. చూపు తక్కువౌతుందట అంటే తాను చూడగదలచుకుంటేనే చూస్తాడు. లేకపోతే చూసిచూడనట్లుంటాడు. ఎప్పుడూ దుర్భాషలాడుతూ తన నోటిని, విన్నవాళ్ల చెవులనూ, అపవిత్రం చేస్తూ ఉంటాడు. తన అధికారానికి ఎప్పుడు విఘాతం కలుగుతుందో అన్న మనోవ్యథతోనో, మత్తతోనో దుర్వ్యసనాలకూ, దుర్వ్యాపారాలకూ, అధికారాన్ని వినియోగించుకుంటున్న ఆ అధికారి ఎన్నాళ్లని ఆట్లా సుఖాల్లో తేలియాడుతూ ఉంటాడు? అధికారం అంతరించగానే ఆయనగారి సౌభాగ్యం కూడా అంతరించిపోతుంది. అధికారం ఉన్నది కదా అన్ని భోగలాలసతో ప్రమత్తుడై ప్రవర్తించినవాడు అధికారం పోగానే అందరి దృష్టిలో పడిపోతాడు. ఎందుకూ పనికిరాని వాడవుతాడు. ఉత్తమసంస్కారం ఉన్నవాడు అధికారంలో ఉన్నా లేకున్నా అందరికీ ఆదరపాత్రుడౌతాడు. అధికారంలో ఉండి దుర్మార్గంగా ఉండి ప్రవర్తించినవాణ్ణి చూసి కడుపుమండి ఎవరో కవి చెప్పిన పద్యం ఇది. చివరిపంక్తి ఎంత అందంగా పొదిగినాడో! "అధికారాంతమునందు చూడవలదా ! యాయయ్య సౌభాగ్యముల్?" అన్నాడు.

దుర్మార్గుల అధికారం నశిస్తే చూడాలనే కోరిక ఎప్పుడూ ఉన్నదే! అయితే ఆనాడు దుర్మార్గాన్ని, 'కర్మ' అని సహించినాడు మనిషి. ఈనాడు అనుచితమైన అధికారాన్ని గద్దెదించగలిగే శక్తినీ, యుక్తినీ, సంపాదించుకున్నాడు మానవుడు. ఇదే ప్రజాస్వామ్యానికి పరమార్థం.

> నేరుపు బ్రహ్మఁజేరె నిజనిర్మల తేజము సూర్యుఁజేరె నా
> కారము కాముఁ జేరె నధికంబగు లక్ష్మియనంతుఁజేరె గం
> భీరత వార్ధిఁజేరెఁ గలపెంపు కులాద్రిఁజేరెఁగీర్తి దా
> నూరట లేక త్రిమ్మరుచున్నది మైలముబీముఁడగ్గినన్, 15

మైలమ భీముడనే ప్రభువు సకల సద్గుణ సంపన్నుడు. భూరియశోవిరాజితుడు. ఈ పద్యం అతని కీర్తిని ఇంతవరకు నిలబెట్టగలుగుతున్నది.

ఒకరిలో ఏవో గుణాలున్నాయని చెప్పటం చాలా సాధారణమైన విషయం. అతణ్ణి శివుడనీ, బ్రహ్మ అనీ, విష్ణువనీ, వర్ణించడం కూడా తరుచుగా కనిపిస్తూ ఉంటుంది. కావ్యాల్లో. కాని ఈ పద్యంలోని చమత్కారం, అతిశయోక్తులను చిమ్ముతున్నట్లుగా లేదు దేవతామూర్తుల కంటే గొప్ప ఆ మైలమ భీముడు. గొప్పవాడని వర్ణించడం లేదుకాని అతని గుణ గణాలను శ్లాఘించిన తీరుతెన్నులు ఈ పద్యంలో అతి హృద్యంగా ఉన్నవి.

ఆ మైలమ భీముడు మరణించగానే అతనిలోని నేర్పు బ్రహ్మలో లీనమైనదట. అతనిలో తేజం సూర్యుని చేరుకుందట. అతని స్వరూపం మన్మథునిలో కలసి పోయిందట. అతని అనంత సంపద విష్ణువును చేరినదట. అతని గాంభీర్యం సముద్రాన్ని చేరిందట. అతని ఔన్నత్యం కులగిరులను ఆశ్రయించినదట. ఇక అతని కీర్తికి 'ఊరట లేక ఎవణ్ణి ఆశ్రయించాలో తెలియక ఎక్కడెక్కడో తిరుగుతున్నదట.

మైలమభీముని నిర్మాణకౌశలం, తేజఃపరాక్రమాలు, తనూవిలాసం, అనంత సంపద ,అగాధ గాంభీర్యం, మహోన్నతత్వం, యశోలక్ష్మి అపురూపములని కవిహృదయం.

ఈ పద్యం చదువుతూ ఉంటే గురజాడ అప్పారావుగారి 'పూర్ణమ్మ' కథలోని ఒక ముత్యాల సరం కన్నులముందు తళుక్కుమంటుంది.

పూర్ణమ్మ ఆత్మాహుతి చేసుకుంది. పూజకు పోయి తిరిగి ఇంటికి రాలేదు.

'కన్నుల కాంతుల కలువల చేరెను.
మేలిమి చేరెను మేనిపసల్
హంసల చేరెను నడకల బెడగులు
దుర్గను చేరెను పూర్ణమ్మ!''

నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మకింపైన భోజనముయ్యెల మంచయొప్పుత
ప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరికినగాకయూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే

శ్రీకృష్ణ దేవరాయలకు అల్లసాని పెద్దన చెప్పిన చాటుపద్యమిదియని రసిక జనశ్రుతి. 16వ శతాబ్దిలో శ్రీకృష్ణదేవరాయలు దక్షిణాపథము నేలిన ప్రభువులలో అగ్రగణ్యుడు. ఆయన సాహిత్య కళాదురంధరుడు. యోధాగ్రేసరుడు. బహుభాషావేత్త. మూర్తీభవించిన వైదుష్యం, ఆయన సంస్కృతంలోనూ రచనలు చేసినాడు. ఆయన వ్రాసిన తెలుగు కావ్యం ఆముక్తమాల్యద. సమకాలిక సాంఘిక జీవితానికి వైష్ణవమత ప్రాశస్త్యానికి ప్రౌఢకవితారచనకూ ఆముక్తమాల్యద చక్కని ఉదాహృతి. కృష్ణరాయలు ఎందరో కవులను పోషించిన ఆంధ్రభోజుడు. ఆయన ఆస్థానంలో అల్లసాని పెద్దన, నందితిమ్మన వంటి కవులు విలసిల్లినారు. పెద్దన 'మను చరిత్ర' ప్రబంధాన్ని, తిమ్మన 'పారిజాతాపహరణ' ప్రబంధాన్నీ రచించి రాయలకే అంకితం చేసినారు. రాయల కవితాపోషణం తెలుగువారి చరిత్రలో నాన్యతోదర్శనం. "ఎదురైనచో మదకరీంద్రముడిగ్గి" కవులను సమాదరించే వాడట. ఆ రాయలొకప్పుడు 'ఆంధ్రకవితాపితామహ' బిరుదాంచితుడైన పెద్దనను ఒక కృతిని రచింపమని కోరినాడట. అంతట రాజడిగినపుడు అంతటి కవి రాజిచ్చిన సమాధానం ఎంత గడుసుగా ఉంది? కవుల స్వేచ్ఛాప్రవృత్తిని రాయలెంత హర్షించినాడో! కావ్యం వ్రాయమని కోరితే పెద్దన కావ్యరచనకు కావలసిన సౌకర్యాల జాబితాను రాయలముందుంచినాడు.

ఏ విధమైన అంతరాయం ఎవడూ కలిగించలేని స్థలం కావాలట. తన భార్యకు ఆత్మీయురాలైన చెలికత్తె అందించిన కర్పూరతాంబూలం కావాలట. ఆత్మకింపైన భోజనం కావాలట. ఊయెల మంచం కావాలట. ఈ హిరణ్యాక్ష వరాలన్నీ చూస్తే నిజంగా పెద్దనాది కవులు కవిత్వాన్ని, అలవోకగా, వెలువరించే విలాస వస్తువుగా భావించినట్టు కనిపిస్తున్నది. కడుపులో చల్లకదలకుండా ఇంటి పట్టున పట్టుపాన్పులపై పవ్వళించి కవిత్వం వ్రాసే వాళ్ళ జాతికి చెందిన

వాడు పెద్దన అనిపిస్తుంది. కాని ఈ పద్యంలో ఒక విశేషముంది. పెద్దన కోరిన వస్నీ రాయలివ్వగలడేమోకాని రసజ్ఞులనూ, ఊహాశాలురైన లేఖకులనూ, పాఠకులనూ, ఎక్కడినుంచి తెచ్చి ఇస్తాడు? రసజ్ఞలోకం అంటే సహృదయ సమాజం. తప్పేదో ఒప్పేదో తెలుసుకోగలిగే పండిత సమాజం. కవి రచనలను చదివి ఆనందించే పాఠకలోకం ఉంటేనే కాని మంచికావ్యం పుట్టదు. కేవలం ప్రశంస చేసే వాళ్ళూ లేదా కేవలం తప్పులు వెదికే వాళ్లూ, సారస్యం తెలియని వాళ్ళూ, కవితా వికాసానికి దోహదం కలిగించ లేరని పెద్దన హృదయం.

కావ్యహేతువులను ఇంత కవితాత్మకంగా చెప్పిన కవి తెలుగులో మరొక డున్నాడో లేడో? ప్రతిభావంతులు, వ్యుత్పన్నులు, రసజ్ఞులు, దోషజ్ఞులు, గుణలేశగ్రహణపారీణులు, కావ్యసృష్టికి అనువైన వాతావరణాన్ని సమకూర్చ గలుగుతారు. ఏవంవిధగుణగరిష్ఠులైన మనీషులున్న సభలను నన్నయభట్టు తన భారతంలో సమాదర భావంతో పేర్కొన్నాడు.

''పరమవివేక సౌరభ విభాసిత సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహా మనో
హర సుచరిత్ర పావన పయఃపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్''

పెద్దన ఆశయాలకూ, ఆలోచనలకూ ఈ నన్నయ పద్యమే ప్రేరకమై ఉండవచ్చుననుకుంటే ప్రమాదం ఏమీలేదు.

వివేక పరిమళాలను గుబాళిస్తూ, ఉత్తమ గుణసంపదలను వెదజల్లుతున్న పద్మాలతో సుందరంగా ప్రకాశిస్తూ, అందరికీ అనుభవించే అవకాశాన్నీ కల్పిస్తూ, పవిత్రులూ, సుచరిత్రులూ, మహోదాత్త వ్యక్తిత్వ సమన్వితులైన మనీషులున్న విద్వత్సభలు సరస్సులవంటివి ఈ విద్వత్సభలలో వివేకం, సౌశీల్యం, పవిత్రత సకలప్రజాహితత్వం కలకలలాడుతూ ఉంటాయి. నన్నయ్యగారి ఈ పద్యం చాటువుకాదు కాని, ఉత్తమకవిత్వం ఎలాంటి సహృదయులుంటే పుట్టుకొస్తుందో, తీగ సాగుతుందో, పుష్పిస్తుందో, ఫలిస్తుందో, ధ్వనింపజేస్తున్నది ఈ పద్యంలోని 'వివేక' శబ్దం, ఒక్కటి చాలు కవితా పారమ్యాన్ని తెలుసుకోవడానికి. ఎన్నిదశలుగా కవిత్వం ప్రసరిస్తుందో దర్శించడానికి.

పెద్దన తన కవితావిర్భావానికి సహృదయుల తోడ్పాటు నాశించినాడు కదా! సహృదయుడంటే ఎవడో తెలియడానికి ఒక అభియుక్తోక్తిని ఉదాహరించి వివరిస్తాను.

ధ్వనిసిద్ధాన్త ప్రవక్త ఆనందవర్ధనుని 'ధ్వన్యాలోకా'నికి 'లోచన' వ్యాఖ్యానం వెలయించిన అభినవగుప్తుడు—

''యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్విశదీ భూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభావన యోగ్యతా తే సహృదయ సంవాద భాజః సహృదయాః''

అంటూ సహృదయ లక్షణాలను వివరించినాడు. అభినవగుప్తుని దృష్టిలో సహృదయుడు పండితుడే కాక నిర్మల మనస్కుడై ఉండవలయును. తరచుగా సత్కావ్యాలను పరిశీలించడంచేత అతని హృదయదర్పణం నిర్మలమవుతుందట. అంటే పక్షపాత దృష్టి, మాత్సర్యం, వైయక్తిక వైషమ్యం, ఇత్యాది దోషాలు లేకుండా పోవడం. ఇలాంటి నిర్మలమైన మనోముకురంలో అతడాస్వాదించిన కావ్యంలోని రామణీయకత్వం ప్రతిబింబిస్తుంది. అప్పుడు హృదయం తన్మయీభావాన్ని చెందుతుంది. ఇలాంటి హృదయం ఎవరికుంటుందో వారు సహృదయులు ఈ సహృదయులు సాహిత్యాన్ని ఆస్వాదించి రచయితకృషికి సార్థకత చేకూరుస్తారు.

పెద్దన్న సామాన్యుడు కాడు కనుకనే ''ఒప్పు తప్పరయు రసజ్ఞులూహ తెలియంగల లేఖక పాఠకోత్తములు'' అంటే సహృదయులు ''దొరికిననగాక యూరక కృతుల్ రచియింపుమనంగ శక్యమే'' చాలా పెద్ద అర్థాన్ని కుప్పిస్తున్న మాట అన్నాడు కవిరాజు. రాజకవి అయిన శ్రీకృష్ణదేవరాయలనే నిలదీసి అడిగినాడు. పెద్దన ఒక కొత్త రకపు కావ్యప్రక్రియకు అంటే ప్రబంధరచనా ఫణితికి నారుపోసి, నీరుపోసి పెంచిన సఫలసాహితీకృషీవలుడు. పెద్దన కావ్యం 'మనుచరిత్ర'తో పరిచయం తెలుగు కవితల మధురిమలతో పరిచయం.

అందుకే మనస్సులోని అక్కసును వెళ్ళబోసుకుని అందరినీ తిట్టినకవి చౌడప్ప, పెద్దనను వెక్కిరించాలనుకోలేదు. పెద్దగా ప్రశంసించినాడు. 'తిట్టు కవిత్వం అంటేనే కవి చౌడప్ప' అన్న నానుడి లోకంలో ప్రచారంలో ఉంది. అంతటి తిట్టుకవి.—

"పెద్దనవలెఁ గృతి చెప్పినఁ
బెద్దనవలె నల్పకవికిఁ బెద్దనవలెనా?
ఎద్దనవలె, మొద్దనవలెఁ
గ్రద్దనవలెఁ గుందవరపుఁగవి చౌడప్పా"

అంటూ పెద్దనకు జోహారులర్పించినాడు.

అలవోకగా రాయలనుద్దేశించి పెద్దన తన వ్యక్తిగతాభిరుచులనూ, ఉత్తమ సాహిత్య సృష్టికి కావలసిన ప్రమాణాలనూ, ఒక ఊపులో ఇంపుసొంపులొలుకుతున్న ఈ చాటుపద్యాన్ని సాహిత్యశాస్త్రమర్యాదాలంకృతంచేసి తెలుగు రసికుల గుండెల్లో శాశ్వతంగా పదిలపరచినాడు.

వాసనలేని పువ్వు, బుధవర్గములేని పురంబు, నిత్యవి
శ్వాసములేని భార్య, గుణవంతుడు గాని కుమారుడున్ సదా
భ్యాసము లేని విద్య, పరిహాసములేని ప్రసంగవాక్యమున్
గ్రాసములేని కొల్వు కొఱగానివి పెమ్మయసింగధీమణీ 17

ఈ పెమ్మయసింగరాజు ప్రౌఢదేవరాయల కాలంవాడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అభిప్రాయపడినారు. జక్కన 'పెమ్మయధీమణి శతకము' రచించినాడని, ఈ పద్యం అందులోనిదేనని అనుకోవడానికి వీలున్నది. అయితే ఆ శతకం ఉన్నదో లేదో తెలియదుకాని 'పెమ్మయసింగధీమణి' అనే మకుటంతో కొన్ని చాటువులు ప్రచారంలో ఉన్నవి. అందులో ఇది ఒకటి.

సుమతీ శతకంలో ఒక పద్యం ఉన్నది.

"అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారునేరున్ ద్విజుడున్
జొప్పడిన యూరనుండుము
జొప్పడకున్నట్టియూరు జొరకుము సుమతీ"

అప్పిచ్చేవాడు, వైద్యుడు, జీవనది హితాహితాలు చెప్పే బుద్ధిమంతుడు, ఉన్న ఊరికే పోవాలె కాని ఇవి లేని ఊరికిపోతే ఏదో విధమైన చిక్కును ఎదుర్కొనక

తప్పదని సుమతీ శతక కారుని హృదయం. అయితే ఈ పద్యంకంటే కూడా సరసమైన పద్యం ఈ చాటుపద్యం. ఇందులో మానవుని వైయక్తిక, సామాజిక, కౌటింబిక, విద్యావిషయిక, దైనందిన జీవితానికి సంబంధించిన అనేకాంశాలు సహజంగా, సరళంగా, అవినాభావసంబంధ బోధకంగా, కవితాత్మకంగా అల్లుకు పోయినవి. పూవుతావులకు ఎంతో విడదీయరాని సంబంధమున్నది. సాంసారిక జీవితంకూడా రసమయంగానూ, సుఖమయంగానూ రూపొందించడానికి కొన్ని హంగులు, కొన్ని సంబంధాలు లభించి తీరవలసిందే. లేకుంటే ఒక వస్తువువల్ల కలిగే లాభం, తృప్తి కలగపోతే కేవలం నష్టమేకాదు. మానసికమైన సంక్షోభాన్ని కూడా అనుభవించవలసివస్తుంది. తేటతేట మాటలతో ఎంత గొప్ప అర్థాన్ని పొదుగుకున్నదీ చాటుపద్యం.

వాసనలేని పూలు, పండితులులేని ఊరు, మనసులో వర్తిస్తూ విశ్వాసాన్ని పొందలేని భార్య, గుణవంతుడు కాని కొడుకు, చక్కని అభ్యాసం లేని విద్య, పరిహాస కుశలత లేని ప్రసంగం, జీతంలేని ఉద్యోగం పనికిమాలినవి. ఇది మనకు సామాన్యంగా కనిపించే అర్థం, కాని ఇందులో ధర్మప్రతిపాదన మున్నది. ఆదర్శసంకేతమున్నది. జీవిత సాఫల్యానికీ, మానసికోల్లాసానికీ ఉండవలసిన లక్షణాల ప్రసక్తి ఉన్నది. ఎంతో పదిలంగా ఈ కవిని అనుసరిస్తే తప్ప మనకీ పద్యంలోని గొప్పతనం మనసుకెక్కదు.

ఘ్రాణతర్పణం చేయలేని కుసుమం ఒక కుసుమమేనా? ఎన్ని వన్నెలుంటే ఏమి? ఎన్ని సొగసులుంటే ఏమి. సౌగంధ్యం లేకపోతే పూలకెక్కడిది నిలువ? అలాగే ఎంతెంత ఎత్తైన హర్మ్యాలుంటే ఏమి గొప్పనగరానికి? ఎందరు సంపన్నులుంటే ఏమి గొప్ప నగరానికి? యుక్తాయుక్త విచక్షణ కలవారు, వివేకవంతులు, పండితులు, నయమార్గప్రవర్తకులు, సచ్ఛీలురు అయిన పండితులు నగరంలో లేకపోతే ఆ నగరం విలువ ఏ పాటిది? ధనధాన్యాలను ఎవడైనా హరించుకుపోతాడు. కాని పాండిత్యం వివేకం వాటిని మళ్ళీ పండిస్తుంది. అందుకే వాసనలేని పూలన్నా, పండితులులేని పురమన్నా ఒక్కటే, ఇక బ్రతుకులోని కష్టసుఖాల్లో పాలుపంచుకునే భార్య విశ్వాసఘాతకురాలైతే ఆ భర్త సంగతి ఏమి? ఆ సంసారం సంగతి యేమి? ఇంటిగతియేమి? పిల్లలగతి యేమి? ''ఇయంగేహేలక్ష్మీ'' అన్న ఆర్యోక్తికి ప్రతీకగానిల్చిన భార్యవల్ల

సర్వవిధాలా సౌభాగ్యాన్ని పొందలేనీ భర్త,వాసనలేని పుష్పాలాంటి వాడే కదా ? పున్నామ నరకం నుంచి తప్పించేవాడుపుత్రుడు అంటారు. మరి అలాంటి పుత్రుకు గుణవంతుడు కాకపోతే తనకూ,తన భార్యకూ, తన వంశానికీ ప్రత్యక్షంగా, సమాజానికి పరోక్షంగా ఒక సమస్యగా తయారౌతాడు. కన్న కొడుకు తనకుగాని, సమాజానికిగాని సంతోషాన్ని కలిగించ లేనప్పుడు వాడు తావిలేని పూవులాంటివాడే అవుతాడు గదా! విద్యను నిరంతరం అభ్యసిస్తూ ఉండాలె. అంటే తనకు తెలిసిన స్వల్పజ్ఞానాన్ని ఆధారం చేసుకుని ఎల్లప్పుడూ ఆలోచిస్తూ చదువుతూ, వ్రాస్తూ, పండితులతో ప్రసంగిస్తూ, తన తప్పులను దిద్దుకుంటూ కృషిచేస్తూ,ఉండాలె. నిరంతర కృషి లేకపోతే విద్య గుంటలోని నీరువలె మునిగిపోతుంది. విద్య నదిలాగా ప్రవహిస్తూ ఉండాలె. మరాఠీ భాషలో నీ చదువు 'ఎలావుంది' ? అని అడగవలసివస్తే అభ్యాసం ఎలా సాగు తున్నది' అనే అర్థం వచ్చే ప్రశ్న వేస్తారు. అంటే చదువుకు అభ్యాసం పర్యాయవాచి." ఎప్పుడో పరీక్ష లొచ్చినప్పుడు చదువు కొందాం లే !" అనుకుంటూకాలయాపన చేసే విద్యార్థిలోకం దేశానికంతగా ఉపయోగపడకపోవచ్చు, నిష్ఠ కలిగిన విద్యార్థులు మాత్రం నిరంతర విద్యా వ్యాసంగాల్లో దీక్షాతత్పరులై కృషిచేస్తూ ఉంటారు. దేశం ముందుకు సాగేది వాళ్ళవల్లనే! మాతులు ముకుచుకుని ముక్తసరిగా,ఎదుటివాడు తనను పలుకరిస్తే ఏదో మహాపాపం చేస్తున్నట్లుగా కొందరు భావిస్తూ, కటువుగా మాట్లాడుతూ ఉంటారు. భాషలో మార్దవం ఉండదు. విన్నవాళ్ళు కూడా "అయ్యో ! దైవమా ! ఎందుకు వీడిని పలుకరించాను" అని వాపోతూ ఉంటారు. ఈ పద్యంలోని 'పరిహాసములేని ప్రసంగవాక్యముగ అన్న మాటకు అర్థం హాస్య సృష్టికాదు.కటు వైన విషయాన్ని కూడా మధురంగా మాట్లాడగలగడం. ఎదుటివాని మనసును నొప్పించకుండా మాట్లాడటం ఎదుటివాని మనస్సు ఆకట్టుకునే విధంగా మాట్లా డటం అని అర్థాలను లాగి తీసుకోవచ్చు. మధుర సంభాషణ లేని పరిస్థితి, పరిమళాలులేని ప్రసూనాల స్థితి చాలీచాలని జీతంతో, ఎముకల మసి చేసుకుని రక్తాన్ని వడకట్టి, తగిన ప్రతిఫలం అందుకోలేకపోతే, కష్టించేవాని కడుపులో రగిలే చిచ్చులు ఏ దహనకాండకు నాందీవాక్యం పలుకుతాయో ఎవరికి తెలుసు? ఏ విప్లవ వాయువులు ఆ చిచ్చులకు తోడవుతాయో ఎవరికి తెలుసు ? గ్రాసం అంటే ఇక్కడ పారితోషికం, జీతం, శ్రమకు ప్రతిఫలం. కష్టార్జితం శ్రమకు

తగిన ఫలితం దక్కకపోతే ఎవడు శ్రమపడతాడు ? ఎంతకాలమని సహిస్తాడు. ఎప్పుడో ఒకప్పుడు ఎదురు తిరుగుతాడు. అందుకే ఈ కవి ప్రతిఫలం లేని కృషిని వాసనలేని పువ్వు అంటాడు. చాలా మృదువుగా అంటున్నాడు. పరమ సత్యాన్ని ఎంత రమణీయంగా చెబుతున్నాడు.

వాసనలేని పూలు, పండితులు లేని పురము, విశ్వాస హీనురాలైన భార్యని గుణహీనుడైన కొడుకు, అభ్యాస రహితమైన విద్య, మాధురీమహిమలులేని, సంభాషణ, ఫలితంలేని శ్రమ వ్యష్టికిగాని, సమష్టికిగాని కొరగానివని ఈ పద్యంలో చాటినాడు. ఇంతచిన్న పద్యంలో మిన్నులుముట్టిన సత్యాలను పొదిగిన ఈ కవి చాటూక్తి ప్రౌఢికి శిరఃకంపన చేయనివాడు కవితాలోకంలోనికి ప్రవేశించడానికిఅనర్హుడే అంటే సాహసం కాదు.

పిలువని కూటికిన్ వెతలబెట్టు ధరావరుడేలు వీటికిన్
జలములులేని యేటికిని సారెకు బంధువుగుండు చోటికిన్
పలువల తోడి పోటికి నపాత్రులసాటికి బోవరాదయా
బలవరీ దరీకుహర భాస్వరి యదరీ దరీ హరీ 18

ఎంత అనుభవాన్ని గర్భీకరించుకున్న పద్యం; పిలవనిచోటికి పోకూడదు. ముఖ్యంగా కూటికి, అంటే భోజనానికి. అనవసరంగా వచ్చినవారి విలువ తెలుసుకోకుండా తిప్పలుపెట్టే ప్రభువున్న ఊరికి పోకూడదు. నీరులేని యేటికి పోయేదేటికి ? చీటికీ మాటికీ పనివున్నా లేకపోయినా బంధువులొచ్చి తిష్ఠవేసే ఇళ్ళకు పోకూడదు. పలువలతో పోటీపడకూడదు. అయోగ్యులతో స్నేహం చేయగూడదు.

పిలువని పేరంటానికి పోకూడదనే సామెత ఉండనే వుంది. అనాహూతుడై ఎక్కడికి వెళ్ళినా మర్యాద జరుగదు. ముఖ్యంగా విందుకు పిలువందేపోతే కూటికోసం వచ్చినవాడనుకుంటారేకాని ఆప్యాయత ఒలకబోయరు. ఆదరాభిమానాలు ప్రకటించరు అయితే ఇది లోకంలో సామాన్యంగా జరిగే వ్యవహారం ఒక్కొక్కసారి గృహస్థుడు చేసుకున్న పుణ్య విశేషం చేత ఒక మహాత్ముడు తలవని తలంపుగా, అనాహూతుడుగా వస్తాడు. ప్రవరుని యింటికి సిద్ధునిలాగా,

దశరథునివద్దకు విశ్వామిత్రునిలాగా అది వేరే విషయం. అది మహావిషయం. ఆ సందర్భం ఇక్కడ పొసగదు. ''పిలువని కూటికిన్'' అనడంలో కూడు అనే మాట ఎంతో బలంగా ఉంది. ఎంతో అనాదరాన్ని కలిగించేలా ఉంది. నుడికారానికి ఉన్న బలానికినిదర్శనంగా వుంది. ధరావరుడు అంటే రాజే అనుకోనక్కర లేదు. గ్రామాధికారి కావచ్చు. ఊళ్ళో పలుకుబడి వున్నవాడుకావచ్చు. వాడు సంస్కారహీనుడై ఇతరులను బాధపెట్టడంలోనే తనకు తృప్తి లభిస్తుందనే వాడున్న ఊళ్ళోకిపోతే ఏముంది? వాడు చిక్కుల్లో ఇరికిస్తాడు. తన సత్తా చూపిస్తాడు. నైచ్యాన్ని ప్రదర్శిస్తాడు. నీళ్ళులేని యేటిలో చేయగలిగిందేముంది? యుక్తాయుక్త విచక్షణ లేనివాళ్ళతో స్నేహం చేయకూడదు. ఎప్పుడూ బంధువులతో కిటకిటలాడుతున్న యింటికి పోతే ఆ గృహస్థు ఎలా సమాదిరించగలుగుతాడు? పోయినవాడికి ఏం గౌరవం ఉంటుంది? సత్రంలో భోజనంచేసినట్లుంటుంది. పలువలు అంటే దుర్మార్గులు. వాళ్ళతో పోటీకిపోతే, వాళ్ళకు ఏలాగూ గౌరవంలేదు. సంఘంలో తన గౌరవంకూడా పోతుంది. అన్నివిధాలా తాను నష్టపడతాడు. తనకే బుద్ధిలేక వాళ్ళ జోలికి పోయినాడని మాట వస్తుంది. కొన్ని మంచి సలహాలను మనకు కవి ఈ పద్యంలో అందించినాడు. మనం వింటామో వినమో, అని నరసింహస్వామికి చెప్పుకున్నాడు. చివరి పాదమంతా సంబోధనలపరంపర. సంబోధన దేవునికి. బోధన మనకు. ఈ పద్యంలోని సొగసు తేటతెలుగు నుడికారపు సొంపు.

ఆడిన మాటలు దప్పిన
గాడిద కొడుకంచుఁ దిట్టఁగావిని యయ్యో;
వీఁడా నాకొక కొడుకని
గాడిద యేడ్చెంగదన్న ఘనసంపన్నా. 19

అని 'అనలేదు' అన్నవాణ్ణి చూస్తే లోకానికి చాలా చిరాకు అసహ్యం. కడుపుడుకు. చివరకు గాడిదకూడా మాట తప్పినవాడు తన కొడుకంటే ఏడ్చిందట మాటకోసం నిలిచేవాడు పెద్దమనిషి. అధికారం ఉన్నా, పాండిత్యం ఉన్నా, సత్యభాషణం, సత్యపోషణం లేకపోతే అవి రాణించవు. పాశవిక ప్రవృత్తిని ప్రేరేపించే లక్షణం అబద్ధానికి ఉంది.నిజం పల్కడం అసాధ్యం అను

కుంటే లోకవ్యవహారమే అస్తవ్యస్తమవుతుంది. అబద్ధంకూడా సత్యాన్ని ఊతగా చేసుకునే బ్రతుకుతుంది. ''నేను అబద్ధం చెబుతున్నాను. మీరు నమ్మండి'' అంటే ఎవ్వరూ నమ్మరు. నిజమే చెబుతున్నాను అంటే తప్ప నమ్మరు. సత్యభాషణం అభిలషణీయమైన ఆదర్శం. ఎంతో ఆత్మస్థైర్యం ఉన్న మనిషికే అనుసరణీయం. అలాంటి మనుషులనే వ్యాసుడు శ్రేష్ఠులు అన్నాడు. వాళ్లు ఎలా నడచుకుంటే ఇతరులు అలా ప్రవర్తిస్తారన్నాడు. పద్యం చదువగానే నవ్వు వస్తుంది. తిట్టినట్టనిపిస్తుంది. కాని గొప్ప అర్థాన్ని కావ్య రసాస్వాదనాపరులకు అందిస్తుంది. చాటూక్తికి ఉన్న సర్వలక్షణాలను కప్పుకున్న పద్యమిది. ఎన్నడూ వాడని పద్యప్రసూనం ఇది. 'సత్యమేవజయతే' అన్న ఆర్యోక్తి ఎంత సార్వకాలికమో, ఎంత సార్వజనీనమో ఈ పద్యంకూడా అంతే. దూషణం ఎంత దురుసుగా ఉందో, ఎంత హాస్యస్ఫోరకంగా ఉందో, ఉపదేశం అంత అంతర్గర్భితంగా, అంత సున్నితంగా, అంత చమత్కారభరితంగా ఉంది.

ఉద్యోగ మొదవిప్పుడు
సద్యోమదమది మొదవి పూర్వసరసత లుడుగున్
విద్యావంతులకైనను
విద్యావిహీనునకు వేఱె వివరంబేలా! 20

ఎంత చదువుకున్న వాడికైనా ఉద్యోగం (అధికారం) లభిస్తే అంతకు ముందు అతనిలో ఉన్న సరసత, స్నేహం ఉడిగిపోతాయట. ఇక చదువులేని వాడికి అధికారం వస్తే ఏం జరుగుతుందో వివరించవలసిన పనిలేదుకదా!

విద్యార్హతలున్నవానికి అధికారం లభించకూడదనికాదు కవి హృదయం. అధికారం దొరికినప్పుడు వ్యక్తి తన పాండిత్యాన్నీ, వివేకాన్నీ, సహృదయతనూ, కోల్పోకుండా జాగరూకతతో తాను సర్వజ్ఞుణ్ణనే అహంకారాన్ని తనదరికి చేరనీయకుండా వ్యవహరించాలె. అప్పుడా అధికారంవల్ల తన వ్యక్తిత్వం వన్నెకెక్కుతుంది. తన విధి నిర్వహణ నిర్దుష్టంగా సాగుతుంది. సంఘానికీ, దేశానికి లాభం చేకూరుతుంది. విద్యావిహీనునికి ఈ అవకాశం ఏది? సరసతను చూపలేడు. సమర్థతను ప్రదర్శించలేడు. విచక్షణారహితంగా ప్రవర్తించి తన

అధికారాన్నే కోల్పోతాడు. తనుక అధికారం గొడుగులాంటిదన్నాడు కాళిదాసు. దాన్ని పట్టుకోవడం తెలియాలె. లేకపోతే వర్షాతపముల నుంచి తనను కాపాడే ఆ గొడుగు వల్ల తనకే మాత్రం లాభం కలుగదు.

వెలయాలు శిశువల్లుఁడు
నిలయేలిక యాచకుండు నేగురుధరలో
గలిమియుఁ లేమియుఁ దలఁపరు
కలియుగమునం గీర్తికామః కాటయవేమా ! 21

కాటయ వేముని సంబోధిస్తూ, కీర్తిస్తూ ఎవరో కవి చెప్పిన పద్యమిది. ధర్మబోధ, సంతానం పట్ల వాత్సల్యం అసంభావ్యమైన, పౌరుష హీనమైన సంపాదన పట్ల అసహ్యాభావం, విచక్షణ—పేదరికాలు కలిసి ఉండవనే యాథార్థ్యం, రాచరికంలో అనివార్యమైన నిష్ఠురత్వం—వీటన్నిటినీ ఈ పద్యంలో కలిసి కుట్టినాడు కవి. దివ్వెల వంటి నిజాలతో వెలిగించినాడీ పద్యాన్ని. కవిత్వం చీకట్లను చీల్చేదిగా ఉండాలె. కవి తాను నమ్మింది చెప్పడం కొంత వరకే కవిత్వం అనిపించుకుంటుంది. లోకం నమ్మేటట్టుగా చెప్పడం అచ్చమైన, నిండైన కవిత్వమనిపించుకుంటుంది. కవిత్వం వ్యక్తిగతాభిరుచిగానే పుట్టుకొస్తుంది. సహృదయ సమాదరణకు అది యోగ్యమైనప్పుడు సమష్టి సొత్తు అవుతుందది. అందరికీ ఆస్వాదనీయమైనప్పుడు కవికల్పన సత్యమౌతుంది అలాంటి సత్యాల ముత్యాల హారమే ఈ అందమైన కందం అందరికీ అందే మాటల్లో చెప్పిన పద్యం. నిజానికీ చాటూక్తి ఒక సూక్తి.

శరీరాన్ని అమ్ముకుని బ్రతికే పడుపుకత్తె తన దగ్గరికి కామార్తుడై వచ్చిన వాడి కలిమిలేముల అంచనాలు కట్టుకుంటూ కూర్చోదు. తనకు కావలసింది ఇచ్చి తీరవలసిందే.

శిశువు అమాయకుడు. వాడు నింగిలోని జాబిల్లిని ముంగిట్లోకి తెమ్మంటాడు. అర్ధరాత్రి ఎక్కడో కాని దొరకని తినుబండారాలు కావాలంటాడు. తెచ్చిచ్చేవాడి సామర్థ్యం వాడి కనవసరం.

ఇక అల్లుని సంగతి - తన మామ చేతికి చిప్పవచ్చినాసరే. తన హిర ణ్యాక్షవరాలు తీరాల్సిందే తానూ పురుషుడే తానుసంపాదించుకుంటేనే పౌరుషం. స్త్రీ పరంగా వస్తున్న ద్రవ్యం అధమం అని సంప్రదాయం ఘోషిస్తున్నా, తాను చదువుకున్నవాడై కూడా, సునాయాసంగా వచ్చే ద్రవ్యానికి ఆశపడుతున్నాడు. వరశుల్కం నేరమని చట్టముంది. తీసుకునేవాడు చెప్పడు. ఇచ్చిన వాడెందుకు చెబుతాడు? అల్లుణ్ణి వియ్యంకుణ్ణి చట్టానికి అప్పచెబుతాడా ? అలా చేస్తే తన కూతురుగతి ? మామకు తనకు ఇచ్చే స్తోమత ఉన్నదా లేదా అనే విచికిత్స అల్లునికి ఉండదట. రెడ్డిరాజుల కాలంలోని అల్లుళ్ళకే ఇంత ఆశ మరిప్పుడు నాగర కతా శిఖరాలను అందుకున్నాము కదా! స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి స్త్రీలుసరే, పురుషులే ఉపన్యాస వర్షాలు కురిపిస్తున్నారే. రోజూ దినపత్రికల్లో కట్నం తేలేని కోడలిని కాల్చి చంపుతున్న వార్తలు వెలువడుతున్నాయి. రెడ్డిరాజులు పది హేనవ శతాబ్దివారు. మనం ఇరవదవ శతాబ్దివాళ్లం అయినా, ఈ విషయంలో 'వాళ్లకంటే మనం నయం' అనుకునే స్థితిలో లేము. అంతకంటె దిగజారిపోయి నాము. ఎంత దయనీయ స్థితి? ఈ పద్యం పాతదా? మనం పాతవాళ్లమా ? లేక కవిత్వానికి కొత్తపాతలు లేవనే అభియుక్తోక్తికి ఈ పద్యం ఉదాహరణమా ? అన్యాయాన్నీ, అక్రమాన్నీ ఆకాలంలోనూ దుయ్యబట్టినారు. అసహ్యించు కున్నారు. ఇప్పటి కవులే సంస్కరణోద్దేశంతో కవిత్వాలు వెలయిస్తున్నారనీ, ప్రాచీన కవులకు సమాజం, సమస్యల అవగాహన లేకుండెనని కొందరదేపనిగా నోటికి పని కల్పించుకుంటూ ఉంటారు. కనుక నిన్నటి, మొన్నటి సాహిత్యం కూడా చదివితే నేటి సాహిత్యం మనకు అందిస్తున్న విలువల తీరుతెన్నులతో చక్కని పరిచయం ఏర్పడుతుంది.

రాచరికం (ప్రభుత్వం) సంగతి సరేసరి. పన్నుకట్టే సామర్థ్యంతో దానికి సంబంధం లేదు. శ్రీనాథునంతటి మహాకవి పన్నుకట్టలేక పడరానిపాట్లు పడ్డాడు. ఆయన ప్రతిభా పాండిత్యాలు పనికిరాకుండా పోయినవి. చాలీచాలని జీతాలతో బతుకు లీడుస్తున్న మధ్య తరగతి ప్రజలు పన్నులు కట్టుతూనే ఉన్నారు. వాళ్ల కలిమి లేముల పట్ల ప్రభుత్వానికిప్పట్లో సానుభూతి ఉన్నట్లు కనిపించదు. ఇక ముందు "నిజంగానే, నిజంగానే, నిఖిలలోకం నిండు హర్షం"తో కలకలలాడు తుందో ఏమో! దైవేచ్ఛ.

ఏదో సహాయాన్ని అర్థించే వాళ్లు యాచకులు - అంటే రకరకాల భిక్షు కులు. వీళ్లకు కూడా ఇచ్చేవాడి కలిమిలేములతో సంబంధంలేదు అవి వాళ్ల తల పుకే రావు. ఈ కలియుగంలో అంటాడు కవి మరితర యుగాల్లో వెలయాంద్రకు, శిబువులకు, అల్లుళ్ళకు, రాజులకు, తదితరుల కలిమిలేముల అంచనా ఉండేవో యేమో! మనకు అంతుపట్టని సందేహం.

నిత్య సత్యాల పేటిక ఈ చాటువు

గడియకు నూఱుపద్దెములు గంటములేకరచింతుఁ దిట్టఁగాఁ
దొడగితినా పతాలుమని తూలి పడుం గులశైలరాజముల్
విడిచి యనుగ్రహించి నిఱుపేద ధనాధిపతుల్యుఁ జేతు నే
నడిదమువాఁడ! నూరన సమాఖ్యుఁడ! నాకొకరుఁడు సాటియే?

18వ శతాబ్దంలో తన కవితాబ్దంతో తెలుగు రసికుల హృదయ సీమలపై రససృష్టి చేసిన మహనీయుడీ చాటుపద్యం చెప్పిన అడిదము సూరకవి.

కావ్యాలు, లక్షణగ్రంథాలు అనేకం వ్రాసి తెలుగు సాహిత్యేతిహాసంలో సముచిత స్థానం కల్పించుకున్నాడు. ఆశుకవితా సృష్టికి పేరుమోసినవాడు. తాము అగ్ని పర్వతాలమనీ, జలపాతాలమనీ, మహానల జ్వాలలమనీ. ప్రభంజ నాలమనీ ఇప్పటి కవులు చెప్పుకుంటున్నట్లు ఆయన కూడా చెప్పుకున్నాడు. ఒక వ్యక్తిలోని సహజమైన కవితాప్రతిభకు ఆత్మవిశ్వాసం, ఔదార్యం, పాండిత్యంకూడా తోడైతే అతని కవిత్వంలో అహంకృతి అప్పుడప్పుడు తళుక్కు మంటుంది. ఆ అహంకృతి ఆ కవికి అలంకారప్రాయంగా ఉంటుంది. ఆయన అభిమానులకది ముచ్చటగా ఉంటుంది. అలనాడు శ్రీనాథునికీ, ఈనాడు విశ్వనాథ, శ్రీశ్రీలకు అంటాటి అహంకారం ఉన్నట్టు కనిపిస్తుంది నిజానికి కవి పండితులకుండే అహంకారం అలంకారం. ఆత్మవిశ్వాసాన్ని వాళ్లు అలా త్యజించి చెబుతారు. అందుకే సాహిత్య శాస్త్రవేత్తలు 'పాండిత్య వీరం' అని ఒక వీరరస భేదాన్ని గుర్తించి వివరించినారు. వీరరసానికి స్థాయీభావం ఉత్సాహం. ఒక ధర్మబద్ధమైన పనిని సాధించాలనే పట్టుదల, ఉత్సాహం వీరరస సృష్టికి దోహదం కల్పిస్తుంది. 'నాఅంత వాడు లేడు' అని ఒక అధికారి, ఒక రాజ్యాధికారి అంటే

లోకానికి ప్రమాదం 'నాఅంతటి కవిని నేనే' అని ఎవడైనా కవి అంటే అది అహంకారం కాదు. 'నన్ను అనుకరించవద్దు. మీ వ్యక్తిత్వాలను కోల్పోవద్దు' అని వ్యంగ్యం.

అనన్య సామాన్యుడైన దేశభక్తుడు, న్యాయశాస్త్ర నిపుణుడు, విద్యావేత్త, బహుముఖీన ప్రజ్ఞాపాటవాలు కలిగిన మహనీయుడు ఆ సుతోష్‌ముఖర్జీ. కలకత్తా విశ్వవిద్యాలయంలో వైస్ ఛాన్సలర్‌గానూ, బెంగాల్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగానూ, లోకసేవ చేసిన ధన్యుడు. ఆయన మంచి వక్త కూడా. ఎవరో ఆయనను అడిగినారట 'మీరింత గొప్పవక్తలు ఎలా కాగలిగినారు. ఆ రహస్యమేదో మాకూ చెప్పండి.' అప్పుడు ఆ మహానుభావుడు, 'దేశభక్తినీ, ధర్మానురక్తినీ పెంపొందించుకుని నన్ననుకరించండి. మీరూ నా వంటి వక్తలౌతారు' అన్నాడట. ఇది అహంకారమా ? ఆ మహాతపస్వి దరిదాపుకు అహంకృతి చేరడానికి సాహసం చేయలేదు. అంతటి మహావ్యక్తి కుమారుడే మహావక్త ఉత్తమదేశభక్తుడు డాక్టర్ శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ.

ఈ పద్యంలో అడిదము సూరకవి తన కవితా శక్తి సూటిగానూ, చాటుగానూ, చెప్పుకున్నాడు. బ్రహ్మాండాన్ని బ్రద్దలుజేసే శక్తి తన కవిత్వానికి ఉన్నదంటాడు. గంటం (ఆనాటి కలం) పట్టకుండానే గడియకు నూరుపద్యాలు చెప్పగల సామర్థ్యం తనకున్నదట. తాను తిట్టితే అంటే, అలిగితే కులపర్వతాలే కూలి పడిపోతాయట. మరి తాను అనుగ్రహిస్తే అంటే, ఎవడికైనా సహాయం చెయ్యాలనుకుంటే ఆ పని తాను చెయ్యగలుగుతాడట. ఆ చెయ్యగలగడం కూడా ఎలాంటిదనుకున్నారు? తన చేయూతతో నిరుపేద ధనికునితో సరితూగి పోతాడట. తాను అడిదము వంశము వాడట. సూరన పేరు గలవాడట. ఇంకొకడు ఆయనకు సాటి రానే రాడట.

'అడిదము' అంటే కత్తి. కత్తికున్న పదును ఈయన కవితకు అబ్బినదేమో! తన కవిత్వం ధారాళంగా, గంగా ప్రవాహసంకాశంగా సాగిపోతుందనీ, కులపర్వతాల ఔన్నత్యాన్ని మించిన భావనా పటిమ తన కవితకున్నదనీ, లేదా కదలక మెదలక పడి ఉండే కొండల్లాంటి హృదయాలను కూడా కరిగించి వేయగలుగుతుందనీ, నిరుపేదలకు సాయాన్ని అందిచ్చి వారిని ఆదుకునే దయార్ద్ర

హృదయం తనకున్నదనీ చెప్పుతున్నాడీ పద్యంలో. ద్రవ్యంకోసం పద్యాలు వ్రాసే కవులున్నారు. ద్రవ్యంకోసం మనస్సును చంపుకునే కవులున్నారు. కాని ద్రవ్య మిచ్చి ఆదుకునే కవులున్నారా? ఎంతటి సత్త్వసంపన్నుడతను. పద్యం చదువుతూ ఉంటే పైకి గొప్పలు చెప్పుకుంటున్నాడేమో అనిపిస్తుంది. కాని పదిలంగా చదివే సహృదయులకూ అధ్యేయతలకూ, మహాకవి లక్షణాలను అందిస్తున్నాడని పిస్తుంది.

తముఁ దామె వత్తురర్థులు
క్రమమెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబులున్న కొలనికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథకృపా! 23

తెలుగు వాగ్గేయ కారులలో మిక్కిలి ప్రసిద్ధుడు క్షేత్రయ్య. మధుర భక్తి కవితకు, దర్శనీయ నాట్యఫణితికి, శ్రవణపేయనాద మాధురికి, తెలుగు నుడికారపు ఇంపుసొంపులకు క్షేత్రయ్య పదాలు సజీవాకృతులు.

ఈ పద్యం క్షేత్రయ్య చాటువని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పేర్కొన్నారు.

తంజావూరు నేలిన రఘునాథ రాయలనుద్దేశించి చెప్పిన చాటువిది.

ధర్మాధర్మవిచక్షణమున్న దాత దగ్గరకు యాచకులు తమకు తామే వస్తారట. యోగ్యులకు దానం చేసేవాడు యోగ్యుడే యోగ్యుని వల్ల దానం పొందినవాడు. పొందే తృప్తి ఇంతింతనరానిది.

మాకందం లాంటి ఈ కందంలో క్షేత్రయ్య యాచకులను, దాతలను పేర్కొన్న తీరు చాలా అందంగా ఉన్నది. చాలా సహజంగా ఉన్నది.

పద్మాలున్న తుమ్మెదలను ఎవరు రమ్మన్నారు? పద్మాల్లో మంచి తేనె ఉన్నదనీ, అది తమకు లభిస్తుందనీ నమ్మిన తుమ్మెదలే అక్కడికి వస్తాయి. ఇది ప్రకృతి సహజం. నిత్య సత్యం.

అంత శృంగారంలో మునిగితేలిన క్షేత్రయ్యకు లోకవ్యవహారంతో ఉన్న పరిచయం ఎంత సునిశితం.

ఎంత కవితాత్మకం! ఆయన ఎంత శృంగారరసమూర్తియో, అంత భక్తి రసావతార మూర్తి. అంత లౌకిక విజ్ఞాన సంపన్నుడు.

> చూత ఫలావతంస! నిన్నుఁజూచినఁ గన్నుల పండుపయ్యె! లో
> పాలి శయంబునన్ బరిమళాన్వితమయ్యె దిశౌఘమెల్ల వి
> ఖ్యాతి యొనర్చె నీ గుణములైననుఁగల్గదు నాకు నెమ్మదిన్
> గౌతక మెప్డు నీ హృదయ కర్కశ భావముచూడగాన్. 24

మామిడి పండునుద్దేశించి అన్యాపదేశంగా చెప్పిన పద్యం ఇది.

కొందరు ఎంతో అందంగా కనిపిస్తారు. సొగసుగా అలంకరించుకుంటారు మధురంగా మాట్లాడుతారు. ఎంతో నాగరికంగా ప్రవర్తించినట్లు కనపడతారు. కాని మనస్సులో ఏముందో ఎవరికీ తెలియనీయరు. తమ పబ్బం గడుపుకోవ దానికి ఎన్ని వేషాలైనా వేస్తారు. ఎదుటివాళ్లను తమ వలలో వేసుకుంటారు. సాహిత్యపోషకులుగా, కళాపోషకులుగా పేరుతెచ్చుకుంటారు కాని వాళ్ల హృదయాలు కర్కశంగా ఉంటాయి. కొన్ని సందర్భాలలో ద్రవ్య సంపాదనా మార్గాలు కూడా దేశహితానికి ప్రతికూలంగా ఉంటాయి.

ఓ చూత ఫలమా! నీవెంతో శ్రేష్ఠమైన దానివి. అలంకారంగా చెప్పకో దగిన దానివి నిన్ను చూస్తేనే కన్నుల పండుగ. ఏ పొరపాటువల్లనో నీ సువాస నలు దిగంతాలకు వ్యాపించినవి. విఖ్యాతి పొందిన నీరుచి, నీవాసన, ఇంకా మరెన్నో ఆకర్షణీయములైన గుణాలు నీకున్నవి. అయినా నాకు నిన్ను చూస్తే నెమ్మది కలుగదు. ఎందుకంటే నీ హృదయం (టెంక) కఠినమైనది. లోని మసకకూ, లోని కాఠిన్యానికీ పైన ఎంత అందమైన ఎంత మృదులమైన ముసుగు కౌతకమంటే 'పైపై వచ్చెడి మేలు' 'అనుభవింపని కోరిక యందలి యాశ' అనే అర్థాలున్నవి. నిన్ననుభవించ కూడదని అనిపిస్తుంది అని ధ్వని. అంటే పై పూతలు. పైకి కనిపించే నాజూకుతనం వట్టి మోసం దంభం, మనస్సుబాగుండాలె

మెత్తగా ఉండాలె ఆర్ద్రంగా ఉండాలె. నవనీతంలా ఉండాలె. అప్పుడే మనిషి పరోపకారానికి పూనుకుంటాడు. ఏమన్నా, ఏమి చేసినా మనస్సులో మాత్రం మాలిన్యం లేకపోతే ఎప్పటికైనా మనిషి సంఘానికి ప్రత్యక్షంగానో పరోక్షం గానో తోడ్పడుతాడు. వేష భాషలకంటే మనస్సంస్కారం గొప్పది. ఇంత అర్థాన్ని అంటె ఇంతమంచి హృదయాన్ని కలిగి ఉన్న పద్యమిది. సహజత్వం ఉన్నది. ప్రకృతి వర్ణనం ఉన్నది. ఉపదేశం ఉన్నది. వ్యంగ్యం ఉన్నది. ఎత్తి పొడుపున్నది ఇంతకంటె చాటు పద్యానికి కావలసినదేమిటి?

కౌనా పేదలకెల్లఁబేద, పలుకా కర్పూరఖండంబు నె
మ్మేనా పైఁడి సలాక ముద్దుమొగమా మేలైన కొత్తమ్మికొ
ప్పానీలంబులకప్పుగప్ప నెఱిచూపా కంతు చేతూపుని
న్నీనే నా నుతియించువాఁడ దగవా ఈ మాట బింబాధరా!

యువతీ వర్ణనం ఈ చాటుపద్యానికి లక్ష్యం.

సుందరుల అవయవాలను ఉపమించి చెప్పడానికి ఆదికవి వాల్మీకి కాలం నుంచి కవితా ప్రపంచంలో ఉపమాసామగ్రి ప్రచారంలో ఉన్నది. ఇప్పటికీ కవులు వదలలేని అందాలొలికే వస్తుజాలమది. ప్రబంధ కవులంతా ఈ ప్రసిద్ధోవ సామగ్రిని పుష్కలంగా ఉపయోగించుకుని తమ అనల్ప కల్పనా సామర్థ్యంతో ప్రతిభావ్యుత్పత్తులతో తమ తమ కావ్యాలను రసోజ్జ్వలంగా తీర్చిదిద్దుకున్నారు 'ఉపమ' అంటే పోలిక, పోలికలకు ఏలిక కాళిదాసు. ఉపమాలంకారం కావ్య సౌందర్యానికి మారుపేరనే నమ్మకం కలగాలంటే కాళిదాసు కావ్య నాటక సందర్శనం చేసి తీరవలసిందే. భారతీయులకు సౌందర్య సంబంధమైన ఆదర్శాలకు కాళిదాసు సాహిత్యం మణిదర్పణం. కాళిదాసు సాహితిని అధ్యయనం చెయ్యని వాడు భారతీయ సాహిత్య ప్రాంగణంలో పచార్లు చేయలేడు.

'బింబాధరా' అనే సంబోధనంతో ముగుస్తుంది పద్యం. ఈ బింబాధర అంటే యువతి అని అర్థం, కాని ఈ చాటువు వ్రాసిన కవిగడుసుతనం ఆ సంబోధనంలోనే ఉంది. ఆ యువతి అవయవాలను ఉపమిస్తూ అమె పెదవులను పోల్చి

చెప్పలేదు. ఆమె పెదవులు దొండపండులా ఎర్రగా ఉన్నవని చెప్పదలచుకుని 'బింబాధరా' అని సంబోధించినాడు.

ఓ బింబాధరా (సుందరీ) నీ నడుము కడు పేదది. అంటే చాలా సన్న నిది పలుకు కర్పూర వాసనలను గుబాళిస్తున్నది. పలుకుతున్నప్పుడు దంత కాంతి కర్పూరంలా ధవళంగా ఉందని కూడా కవి హృదయం. మేను బంగారు కడ్డీలాగా కాంతులు పరజిమ్ము తున్నది నీ సుందర వదనం అప్పుడే పూచిన పద్మంలా ఉంది. నీ ధమ్మిలం ఇంద్ర నీలమణుల రాశిలా ఉంది నీచూపు మన్మ ధుని తూపు నిన్ను నేను పొగడ లేను నిన్ను నేను కీర్తించడం తగువుకాదు. అంటే న్యాయం కాదు. అంటే న్యాయం చెయ్యలేను నిన్ను వర్ణించలేను. నీ అందచందాలను నా మాటల్లో పొదగలేను అంటూనే పొగిడినాడు ఒక యువతిని నుతించగల వాడననటం న్యాయం కాదంటూనే ఒక అందాలరాశిని మనకు చూపించినాడు. ఈ పోలికలు తెలుగు కావ్యాలు చదివే వారికంతా తెలిసినవే. తెలుగు చలన చిత్రాల పాటలు వినే వారికంతా తెలిసినవే, కాని నిన్ను నేనానుతిం చగలవాడను? అని అనడంలోనే ఉంది చమత్కారమంతా మీరు పొగడ్తలకు పొంగి పోరని నాకు తెలుసునండీ అంటూ పొగుడుతారు. పొగడ్త అగడ్తలో ఎంతటి వాడైనా పడతాడు.

ఈ పద్యంలో పొగడ్తకంటే మించిన ప్రణయినీ సందర్శనం, సౌంద ర్యోత్కర్ష, అనుభవైక వేద్యమైన అందాల తీరుతెన్నులు మనసును మరో లోకంలో లోకంలోకి తీసుకుపోతాయి.

ఘనతర ఘూర్జరీయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తన గతిఁ దేటగాక, అరచాటగు ఆంధ్రవధూటి చొక్కపుం
జనుగవపోలె తేటయును( జాటు దనంబును గాకయుండ చె
ప్పిననదిపో కవిత్వమనిపించు నగించటుగాక యుండినన్.

ఈ చాటువు అల్లసాని పెద్దన దని కొందరు. కన్నడభాషలో విశేష ప్రాచుర్యాన్ని అందుకున్న పద్యానికి ఇది తెలుగు వేషమని కొందరు ఎవరో

వేంకటనాథకవిదని కొందరు. ఏదైనా పండితలోకంలో, సహృదయ సమాజంలో చాలా ప్రసిద్ధిని పొందింది. కవితా తత్త్వాన్ని వివరించేవాళ్లకీ చాటువు అలవోకగా తలపుల తలుపులు తెరుస్తుంది. ఈ పద్యాన్ని ఊతగా, మనోహరణోదాహరణంగా, సాహిత్య విమర్శకులు గ్రహించి కవిత్వాన్ని వ్యాఖ్యానిస్తూ ఉంటారు.

ముక్తకాలైనా చాటువుల్లో అనంత శాస్త్రసంపద నిక్షిప్తమై ఉన్నది. మహాకవులు తమకావ్యాలలో చెప్పలేనివి కొన్ని ఉంటాయి. మహాకావ్య రచనకు పూనుకున్నప్పుడు, కొన్ని ఔచిత్యాలనూ, కొన్ని పరిమితులనూ కాదనడం కష్టం. కనుక ఎప్పుడో తమకు తోచినప్పుడు కథ, పాత్రచిత్రణ, వర్ణనం, ఇత్యాది శృంఖలాలు లేనప్పుడు జన్మాంతర వాసనా సంలబ్ధమైన ప్రతిభ చిమ్ముకొస్తుంది. చాటుపద్యం, ఝటితిస్ఫూర్తిగా తళుక్కుమంటుంది. శంపాలతలా. ఆక్షణంలో మెరుస్తుంది. ఆమెరుపు మరుపుకురాదు కావ్యరసికులకు.

విభిన్న భాషాప్రాంతాల కాంతల వేషవిశేషాలను తెలుపుతున్న పద్యం ఇది. కవిత్వాన్ని నిర్వచించడానికీ, వ్యంగ్యార్థ ప్రతిపాదనం చెయ్యగలిగినప్పుడే వాక్యానికి కావ్యత్వమబ్బుతుందనే యాథార్థ్యానికీ ఈ చాటుపద్యం లక్ష్యంగా నిలుస్తున్నది.

ఈ పద్యం వ్రాసిన కవికాలంలో ఘూర్జర (గుజరాత్) ప్రాంత్రం వనితలు నిండుగా పైట వేసుకునేవారట. ద్రవిడ దేశం (కేరళ ప్రాంతం స్త్రీలు పైటలే వేసుకునే వారుకారట. తెలుగు తెరువలు పైట వేసుకునే తీరులో ఒక అందం ఉండేదట. తమ వక్షోజాలు అరచాటుగా అంటే కనబడీ కనబడనట్లుగా పైట వేసుకునేవారట.

ఇప్పటికీ ఈ ప్రదేశాల్లోని స్త్రీల చీరకట్టులలో ఈ వైవిధ్యం అక్కడక్కడా కనిపిస్తూనే ఉన్నది. తెలుగుదేశంలో చాటుపద్యం చెప్పిన కవి కాలంలోనే కాదు. ఇప్పటికీ ఇదేతీరు. సమైక్యం పెంపొందుతున్నకొద్దీ యావద్భారతంలో వేషభాషల్లో సామ్యవైషమ్యాల యవనికలు తొలగిపోతున్నాయేమో !

కవిత్వం కూడా తెలుగువనితల చనుగవవలె మరీ తేటగానూ, మరీ చాటుగానూ లేకుండా ఉంటేనే బాగుంటుంది. "చెప్పిన నదెపో కవిత్వమనిపించు"

అన్నమాట నిశ్చయ బుద్ధిని తెలుపుతున్నది. కవికొంత తాను చెప్పి సహృదయులకు ఊహించుకునే అవకాశం కల్పించాలె. మరీ తేలిపోగూడదు. మరీ మరుగున పడిపోగూడదు. బట్టబయలు చేసి చెప్పినా, గూఢంగా చెప్పినా ఏదో చెప్పినట్టుగా ఉంటుందే తప్ప రసస్ఫోరకమైన కవిత్వం చెప్పినట్టుండదు. కవితా ప్రపంచంలో అతి వివరణం ఎంత అనపేక్షణీయమో, అత్యావరణం అంత అనావశ్యకం. కొంత కప్పిచెప్పడమే ధ్వని. వక్రోక్తి.

ఒకసారి మహాకవి డా. సి నారాయణరెడ్డి ఈ సత్యాన్నే తన సహజ ధోరణిలో ఇలా అన్నారు. ఆయనకొక విశిష్టమైన రచనాశైలి ఉన్నది. శ్రవణపేయమైన శబ్ద సంవరణం. రమణీయమైన అర్థప్రతిపాదనం. సుందరాకారానికి సౌశీల్యం తోడైతే ఏర్పడే పరిస్థితి నారాయణరెడ్డి కవితాస్థితి.

ఇక శ్రీ రెడ్డిగారి వచశ్శ్రీని దర్శించండి.

"కప్పి చెప్పేది కవిత్వం
విప్పి చెప్పేది విమర్శనం"

తేటదనానికీ శబ్దసారళ్యానికీ అంతగా సంబంధం లేదు. అలాగే గూఢతకూ శబ్దకాఠిన్యానికీ అంతగా సంబంధం లేదు.

మంచినీళ్లు దాహం తీరుస్తాయి, అందరి దప్పికను ఆర్పుతాయి. అయితే కవిత్వం అందరినీ అలరించగలుగుతుందని అనుకోవడం పొరపాటు. కాకపోతే తొందరపాటు.

కవితా దృష్టిలో ఎంత వైలక్షణ్యం ఉన్నదో కవితావగాహనకు కూడా అంత వైలక్షణ్యం ఉన్నది. కవి సులభములైన మాటల్లో వ్రాస్తే అందరికీ అర్థం అవుతాయనుకోవడం భ్రమ. కఠినమైన మాటల్లోనూ కవితాత్మ దాగి ఉంటుంది. కవిహృదయాన్ని తెలుసుకోవాలనే ఆసక్తి పదాల సారళ్య కాఠిన్యాలకు అంతగా ప్రాధాన్యం ఇవ్వదు.

ప్రాచీన కవుల మాట వదిలేద్దాం ప్రస్తుతానికి.

ఆధునిక కవుల్లో మహా ప్రతిభాశాలి శ్రీ శ్రీ. అభ్యుదయ కవితా పథానికి మార్గదర్శి. 'అనితరసాధ్యం నా మార్గం' అని చాటుకోగలిగిన స్వేచ్ఛాప్రియుడు.

ఆయన ఒక ఖండికలో—

"జాతి జాతి నిర్ఘాత పాత సంఘాత హేతువై" అన్నారు.

మరో ఖండికలో—

"అదృష్టవంతులు మీరు
వెలుగును ప్రేమిస్తారు....
వడ్డించిన విస్తరి మీ జీవితం"

అన్నారు.

మొదటి ఉదాహృతిలో దీర్ఘ సమాసం. కఠిన పదాల్లో నడిచిన సమాసం.

రెండవ ఉదాహృతిలో అన్నీ పొడి పొడి మాటలే. సులభమైన పదాలే. అందరికీ అందుబాటులో ఉన్న పదాలే. అనాథునికీ, అగర్భ శ్రీనాథునికీ అనంత కాలంనుంచి జరుగుతున్న ఘర్షణ భంగ్యంతరంగా ఈ తేట తేట మాటల్లో ఉందని ఎందరు తెలిసికోగలిగినారు? వ్యుత్పన్నులైన సహృదయులకే అది సాధ్యం. దుర్భరదారిద్ర్యానికి దారితీసిన వ్యవస్థపై ఆ మహాకవి ఎత్తిపొడుపు ఈ సరళాతి సరళములైన పదాల్లో ఉందని ఈ గేయఖండిక చదివినవాళ్ళందరికీ తెలుస్తుందా? అర్థంచేసుకోవడానికి ప్రయత్నంచేయాలె. అది ఉత్తమాధ్యయనపరుల లక్షణం. తమకు అర్థంకాకపోతే అట్లా వ్రాసిన కవులదే పొరపాటు అనడం అనుచితం.

'విశ్వనాథ పంచవింశతి'లో విశ్వనాథవారు ఒక చక్కని పద్యం వ్రాసినారు. ఈ పట్టున ఆ పద్యాన్ని ఉట్టంకించడంవల్ల ప్రయోజనం ఉందని భావిస్తున్నాను.

"తొలినాళుల పద్యార్థము
తెలియనిచోఁ బాఠకునిది తెలియమ యినా
ఁకల వ్రాసిన కవి దోషము
కలి ముదిరినకొలఁది చిత్రగతులను నడచున్"

నిన్నటి మొన్నటి కాలంలో మహాకవులు వ్రాసిన పద్యాలు అర్థంకాకపోతే పాఠకులు తమ అజ్ఞతను గుర్తించుకుని నిఘంటువుల సహాయంతో అర్థంచేసుకునే వారు. ఈ రోజుల్లో పద్యం అర్థంకాకపోతే వ్రాసిన కవి దోషమని బాహాటంగా ప్రకటిస్తూ చదివే ఓపికను కోల్పోతారు.

తేలిక మాటల్లో చెప్పినంత మాత్రాన కవిత్వం కాదు. అందరికీ అర్థం కాదు. సహృదయులు కావ్యమర్మజ్ఞులు మాత్రమే కవి హృదయపు లోతుల్లోకి పోగలుగుతారు. పదాల సారళ్యం, కాఠిన్యం కవుల శైలీవిశేషం మాత్రమే. బాహిర వేషం మాత్రమే.

''అల్పాక్షరములందు ననల్పార్థరచన
కల్పించుటయెకాదె కవి వివేకంబు''

అన్నాడు పాల్కురికి సోమనాథుడు అలనాడెప్పుడో పన్నెండో శతాబ్దంలో. మాటలు చిన్నవే అయినా అర్థం మిన్నగా ఉండాలె. ఆ మిన్నయైన అర్థాన్ని అవగతం చేసుకోగలిగిన శక్తి ఉన్నప్పుడే కవిత్వాన్ని ఆస్వాదించే సామర్థ్యం కలుగుతుంది. అట్టి సామర్థ్యాన్నే సహృదయత అంటారు.

'కావ్యాత్మ ధ్వని' అన్న సిద్ధాంతాన్ని నమ్మిన కవి ఈ చాటు పద్యంలో కనిపించీ కనిపించనట్లున్నాడు. మేలిముసుగులో మరుగుపడిన అందాల నెమ్మోములా పలుచని మబ్బుల దువ్వలువ కప్పుకున్న జాబిల్లిలా.

'చనుగవ' ప్రసక్తిలో ఏదో సహించరాని శృంగారం ఉందని వెంటనే అనుకునేవాళ్లు ఈ పద్యంలోని సొగసునూ, ఆంతర్యాన్నీ గమనించలేరు.

కచకుచాదివర్ణనం అశ్లీలం కాదు. వర్ణించే తీరులో అశ్లీలత ఒక్కొకసారి భాసిస్తాయి. అది కవి వర్ణనాదక్షతకూ, సంస్కార వైశిష్ట్యానికీ సంబంధించిన విషయం.

బమ్మెర పోతనది ఈ చాటువును చిత్తగించండి.

కాటుక కంటినీరు చనుకట్టుపయిఁబడ నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల యో మదంబ యో

హాటకగర్భురాణి నిను నాకటికై కొనిపోయి యల్ల క
ర్ణాట కిరాత కీచకుల కమ్మఁ దిృిశుద్ధిగ నమ్మ భారతీ. 27.

''కాటుక కంటినీరు చనుకట్టు పయింబడనేల యేడ్చెదో'' అని పోతన్న ఆ చదువుల తల్లిని ఓదార్చినప్పుడు మనకు శృంగారం భాసిస్తున్నదా? ఆకలి తీర్చుకోవడానికి కీచకులకు నిన్ను అమ్మను. మనస్సుతోగాని, వాక్కుతోగాని, చేతతోగాని ఇది నేను చేయరాని, చేయలేని, చేయకూడని పని. నన్ను నమ్ము తల్లీ! భారతీ! కైటభాసురుని సంహరించిన శౌర్యనిధి శ్రియఃపతికి నీవు కోడలివి. హిరణ్యగర్భుడైన బ్రహ్మకు రాణివి. నిన్ను నమ్మినవాడు దుర్బలుడేమీ కాడు దుర్జయుడు. శారదను సంబోధించిన తీరు ఎంత అర్థవంతంగా ఉన్నదో గమనించండి. అంతటి శూరుని కోడలు ఆమెను నమ్ముకున్న తననేం చేస్తారు కిరాతకులు? ఆ బ్రహ్మకేరాణివి. కనుక నిన్ను నమ్ముకున్నవానికి జ్ఞానికేమి లోపం?

పోతన 'చనుకట్టు' అని ప్రయోగిస్తే మనకు శృంగారభావం రేఖా మాత్రంగానైనా గోచరించడం లేదు.

కవితాస్వాదనం, కవితాసృష్టివలెనే ఒక అపురూపమైన విషయం.

సందర్భాన్నీ, కవి వ్యక్తిత్వాన్నీ, అతని వ్యుత్పత్తినీ సందర్శించ గలిగినప్పుడే కవిత్వం హృదయానికి హత్తుకుంటుంది. కావ్యం లోకానికి శ్రేయస్సును ప్రసాదించగలుగుతుంది. అంటే ఎలాంటి కావ్యం వ్రాస్తే, ఎలాంటి కవి వ్రాస్తే లోకానికి శ్రేయస్సు కలుగుతుంది. మనిషిని దేవతగా మలిచే మనస్తత్వం కవికున్నప్పుడే అది సాధ్యం—

మహాకవి దాశరథి

''కోతిని మనిషిగా తొలిచిన
కాస్మిక్ రేడియేషన్ బలమే
నా కలంలో చొరబడి
మనిషిని దేవతగా మలుస్తుంది'' అన్నారు

లోకాన్ని అర్థంచేసుకున్నకవి వాస్తవానుభూతులకు శబ్దాకృతులు కలిగించగలిగి నప్పుడు, ప్రజ్ఞాచక్షువులతో ప్రపంచాన్ని చూడగలిగిన వ్యక్తిత్వాన్ని కవి సంతరించుకున్నప్పుడు త్రికాలాబాధ్యమైన నిత్యసత్యాలను చెప్పగలిగిన వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, ఉమర్ ఖయ్యాం, షేక్స్పియర్ కోవలోని కవులు లోకానికి జ్ఞానభిక్ష పెట్టుతారు. వాళ్లకు అనుకరించడం కాక అనుసరించడం అభిలష ణీయం. కాలానుగుణంగా వ్యాఖ్యానం చేసుకోవడం అవసరం వాళ్ళ భావాలకు కాలదోషం పట్టదు.

> పన్నిన సత్ప్రబంధమున బాగును నోగును జాడ కూరకే
> మన్నన మాలి మాకొలము మాట దలంతురు చేమకూరవెం
> కన్నకు లోపమేమి? కులమా కవనానకు వేంకటాద్రిరా
> జన్న గణించి మీరలు దయామతి జూచిన నాకు జాలదే! 28

తన కావ్యంలోని ప్రతి పద్యంలోనూ చమత్కృతిని ప్రదర్శిస్తానని శపథం చేసి 'విజయ విలాసమ' నే అందమైన ప్రబంధాన్ని రచించి తెలుగు కవితను నూతనాలంకృతులతో కైసేసిన మహాకవి చేమకూర వేంకటకవి. అయితే ఆయన బ్రాహ్మణుడు కాడని కొందరీసడించుకునేవారట. బ్రాహ్మణుడై పుట్టి నంత మాత్రాన ఎవ్వడూ పూజా భాజనుడుకాలేడు. ఆకాలంలో చదువుకున్న బ్రాహ్మణునికే మడులూ, మాన్యాలూ, గౌరవాలూ, మర్యాదలూ. చదువురాని బ్రాహ్మణులకు ఏదో సత్రాల్లో భోజనం లభించేదేమో; ఎక్కడైనా అనూచా నంగా వస్తున్న ఆచారాలను అనుసరిస్తున్నవాళ్లు తృణమో, పణమో ఇచ్చే వాళ్లేమో! అంతేకాని కులంపేరుతో ఆధిక్యత సంపాదించుకున్న సందర్భాలు చాలా అరుదు. యోగ్యత లేకపోయినా కులాన్ని బట్టి గౌరవం, అధికారం నిన్నటి దినాల్లో లేవు. చదువు సంధ్యలు లేని బ్రాహ్మణులు నీళ్లు మోసియో, పీనుగులు మోసియో బ్రతుకీడ్చుకొనవలసిందే! చదువుంటే, ప్రతిభ ఉంటే ఏ కులం వాడైనా ఆదరపాత్రుడయ్యేవాడు. ప్రాచీనాంధ్ర మహాకవులలో అస దృశ కవితా ప్రతిభలను ప్రదర్శించి అశేష గౌరవాదరాలను పొందిన వారనేకులు. వారిక సాహిత్య. చరిత్ర కారులు సముచిత స్థానమిచ్చి తమ ఉచిత జ్ఞతను ప్రకటించుకున్నారు.

అయితే ఈర్ష్యాద్వేషాలకు ఏవో రంగులు పులుముతే తప్ప అవి తమ పైశాచిక నృత్యం చేయలేవు. ప్రాంతమనో, కులమనో, మతమనో, సంప్రదాయమనో, ఏదో ఒక వంకతో ప్రతిభావంతుణ్ణి కించపరచాలనే ప్రయత్నాలు ఎప్పటికీ సాగుతూనే ఉంటాయి. అన్ని రంగాల్లో, చరిత్ర పుటలు తిరగేసే వాళ్లకీ సంగతి బాగా తెలుసు.

చేమకూర వేంకట కవి పట్ల అనాదరభావాన్ని చూపిన ఇతర కులాల వాళ్లను ఈ చాటువును చెప్పిన కవి దుయ్యబట్టినాడు.

చేమకూరకవి అల్లిన ప్రబంధంలో గుణదోషాలను వివరించకుండానే, తమకులంవాడు కాడనే దుష్పక్షపాతబుద్ధితో మన్నన మాలి అవాకులూ చెవాకులూ ప్రేలుతూ ఉంటారు. కులం తక్కువైనంత మాత్రానా చేమకూరవేంకటకవికి వచ్చిన లోపమేమి ? కవిత్వానికి కులమూ కొలతబద్దా? బ్రాహ్మణభేదాలు కల్పించుకుని, కులమత భేదాల కల్లబొల్లి తెరల చాటున ప్రతిభావంతులను గుర్తించక, గౌరవించని వాళ్లు నిజంగా అరసికులే. అజ్ఞానులే. ఈర్ష్యామలీమసమనస్కులే.

18వ శతాబ్దంలో బుచ్చి వెంకన్న అనేకవి ఒక కావ్యం వ్రాసి కీర్తిసాంద్రుడైన వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడిని సందర్శించినాడట. ఈ వెంకన్న కళావంతుడు. చేమకూర వేంకటకవి కూడా కళావంతుల జాతి వాడని ప్రతీతి. నాయుడుగారి ఆస్థానంలో ఉన్న కొందరు బ్రాహ్మణ పండితులు వెంకన్న కావ్యానికీ, చేమకూర కవితాప్రతిభకూ వంకలు పెట్టి అధిక్షేపించిరట. అప్పుడు ఒళ్లుమండి ఆ బుచ్చి వెంకన్న చెప్పిన పద్యమిది.

కులతత్త్వం ఇప్పుడూ ఉన్నది. ఇంకా ఉద్ధృతంగా ఉన్నది. చదువు తగినంత రాక పోయినా, ప్రతిభ లేకపోయినా, చదువుకున్న వాళ్లకూ, ప్రతిభావంతులకూ లభించే మర్యాదలు తమకు లభించాలనుకుంటున్నారు కొందరు. బుద్ధిమంతులెవ్వరూ నిన్నటి దినాల్లో కులతత్త్వాన్ని హర్షించలేదు. నేడుకూడా ప్రోత్సహించరు. కులతత్త్వం బలహీనతకు మారుపేరు. దేశంలోని సమైక్య శక్తులకు వేరుపురుగు. మనిషికి విశాల దృక్పథాన్ని చూపలేదు. కులాన్ని ఎత్తి

చూపి ఎదుటివాణ్ణి న్యూన పరచడం అనాగరకం. ఏకులంవాడు చేసినా తప్పే. కనుకనే బుచ్చివెంకన్న కోపంలోనూ గొప్ప సత్యాన్నే అందించినాడు. కోపంలోనూ వివేకం కోల్పోలేదు. కోపంలో తన జ్ఞానాన్ని కప్పివేయ గలిగే అవివేకాన్ని జయించగలిగినాడు. మనిషికి కోపం రావడం సహజమే. అయితే ఆ కోపంలోనూ నాగరకతా సౌగంధ్యాన్ని ప్రసరింపగలిగే సంస్కారం ఏ కొందరికో ఉంటుంది. ఆ సంస్కారానికీ, కులానికీ సంబంధంలేదు. ఈ పద్యం వ్యంజిస్తున్న పరమార్థం ఇదే! అంతేగాని తన కులం గొప్పదని చెప్పుకునే దుర్బుద్ధి ఈ పద్యానికి ప్రేరకం కాదు.

బూడిద బుంగవై యొడలి పోడిమి దక్కి ముఖంబువెల్లనై
వాడల వాడలందిరిగి వారును వీరును చొచ్చొచో యనన్
గోడల గొందులం దొదిగి కూయుచు నుండెదు కొండవీటిలో
గాడిద! నీవునున్ కవివి గాదు గదా అనుమానమయ్యెడిన్. 29.

ఈ చాటువు శ్రీనాథమహాకవిదని నమ్మకం. అంతటి మహాకవి కవినుద్దేశించి ఇలాంటి పద్యం చెప్పి ఉంటాడా? శ్రీనాథుని జీవితం ఎగుడు దిగుళ్లతో గడచినది. ఆయన కవితా చక్షువుకు కనబడనిదేదీ తెలుగు సీమలో లేదు. రాజాధిరాజులతో హేమపాత్రల్లో విందులారగించినాడు. 'గంధర్వాప్సరోభామినుల వక్షోజ కుంభి కుంభములపై వాసించు పరీమళాలను అనుభవించినాడు. జొన్నన్నము తిన్నాడు. తీర్ల తీర్ల వేషములు ధరించినాడు. పలురకముల మనుషులతో వ్యవహరించినాడు. చిల్లరదేవుళ్ల ఆనవాళ్లను కనుగొన్నాడు. కరణాల బాధలకు గురియైనాడు. రాజులాయనకు అర్ధసింహాసనాన్ని చూపిస్తే ప్రజలాయనకు హృదయసింహాసనాలను సమర్పించుకున్నారు. రెడ్డిప్రభువుల ఆస్థానంలో విద్యాధికారిగా ఉండి, పండితుల నెందరినో పరీక్షించి పారితోషికములనిప్పించినాడు. ఉద్భట వివాదాలలో ప్రౌఢిమలను ప్రదర్శించినాడు. అన్ని కులాల తెరువలపై పద్దెములు చెప్పినాడు. పూజారి కోడలిపై పద్దెము, తమలపాకులమ్ముదానిపై పద్దెము, సాంపరాయని తెలుంగాధీశునిపై పద్దెము. ఆయన చాటుపద్యాల పోకడలు చూస్తే ఈ పద్యంకూడా ఆయన ముఖతః వెలువడిందనుకోవడంలో విడ్డూరం ఏమీ లేదు.

ప్రతిభలేక, వ్యుత్పత్తిలేక, అభ్యాసంలేక, నోటికి వచ్చిందల్లా వాగుతూ, సందుల్లో, గొందుల్లో అవ్యుత్పలున్న తావుల్లో మహాకవులను అధిక్షేపిస్తూ, వెక్కిరిస్తూ, తామూ కవులమని తిరిగే అడ్డగాడిదలు శ్రీనాథుని కాలంలోనూ ఉండేవారేమో! కొండవీటిలో తిరిగే ఒక గాడిదను చూసి శ్రీనాథుడు చెప్పిన పద్యం అప్పటి వాతావరణాన్ని తెలియజేస్తున్నది. శ్రీనాథునంతటివాడున్నప్పుడు అందరూ అలాంటివాళ్లే ఉండరు. రాముడున్నప్పుడు రావణుడూ ఉంటాడు. ఎంత శుభ్రమైన, అందమైన నగరమైనా డ్రేనీజీ ఉంటుంది. మహా నాటకంలో అన్ని ప్రధానపాత్రలే ఉండవు, అడవుల్లో చీమలూ ఉంటాయి. పాములూ ఉంటాయి. జింకలూ ఉంటాయి. సింహాలూ ఉంటాయి. గరికా ఉంటుంది. మహా తరువు ఉంటుంది. శ్రీనాథుని వ్యక్తిత్వం పరస్పర వైరుధ్యాల సమ్మేళనం. విద్వదౌషధం అనిపించుకున్న 'నైషధం' ఆయనదే. అయఃపిండమనిపించుకున్న 'కాశీఖండం' ఆయనదే. వ్యాకరణ దోషాలకూ, వ్యావహారిక ప్రయోగాలకూ పుట్ట అనిపించుకున్న 'పల్నాటి వీరచరిత్రం' ఆయనదే.

'బూడిదబుంగ' అంటే బూడిదబుట్ట, లేకపోతే బూడిదతో తయారు చేసిన విదిలిపోయే చిన్నమూతి ఉన్న కుండ. ప్రాగల్భ్యం లేనివాడవై లేదా చెత్త నింపుకున్న మెదడు కలిగినవాడవై, శరీరకాంతిని కోల్పోయిన వాడవై, కవితా వర్చస్సు లేనివాడవై అని అంతరార్థం. ముఖం వెలవెలాబోతూ ఉంటుంది. అంటే మహాకవులు ఎదురైనప్పుడు ముఖం పేలవమైపోతుంది. వీధుల్లో తిరుగుతుంటే వాళ్లూ, వీళ్లూ అదిలిస్తుంటే, అంటే వెకిలిగా పలకరించి గేలిచేస్తుంటే, నిండు సభల్లోగాక, సందుల్లో, గొందుల్లో అరుస్తూ కొండవీటిలో తిరుగుతూ ఉంటావు. ఓ గాడిదా! నీవూ కవివా ఏమి? నాకు అనుమానం కలుగుతున్నది. చివరి మాటలో ఉంది కవితాపారమ్యమంతా. గాడిదను చూసి అది కవియో ఏమో అన్నంత అనుమానం కలిగేంత పరిస్థితి ఏర్పడిపోయింది. శ్రీనాథుని కాలంనాటికే ప్రజ్ఞాహీనులైన కవులు గాడిదల్లాగా వీధుల్లో తిరుగుతూ ఉండే వారని ఈ పద్యంలో ధ్వనిస్తున్నది. కవిని గాడిదతో పోలిస్తే ఎవరికైనా కోపం వస్తుంది. కాని 'అనుమానమయ్యెడిన్' అన్నమాట కవితాత్మను కడుపులో దాచుకున్నమాట. ఈ పద్యంలో పైకి హాస్యం ఉంది. లోన ఉపదేశం ఉన్నది. తరచిచూసే అద్వైతకు సాంఘిక చరిత్ర జాడలున్నవి. 'నీవు మూర్ఖుడవా?' అంటే మూర్ఖుడు కానివానికి కోపం రానేరాదు. అడిగే మనిషి వ్యక్తిత్వం తెలిసి

ఉంటే ఆశ్చర్యం కలుగవచ్చునేమో! ఈ చాటువు శ్రీనాథునిదో కాదో ఈ సంశయం కొందరికి మాత్రం ఉంది.

కాని శ్రీనాథునివే అని విశ్వసనీయంగా చెప్పగలిగిన చాటువులనేకం ఆయన వైయక్తిక జీవితానికి సంబంధించిన విషయాలను మనకు అవి వివరంగా తెలుపగలుగుతున్నవి

కేతన. పుణ్యాన తిక్కన్నను గూర్చిన అనేకాంశాలు మనకు తెలిసినట్లే, శ్రీనాథుని చాటువులు ఆయన జీవిత విశేషాల నెన్నింటినో తెలుపుతున్నవి. ప్రాచీనాంధ్ర కవులలో తిక్కన, శ్రీనాథులను గూర్చి తెలిసినంతగా మనకే కవిని గురించి కూడా తెలియదు. కేతన, తిక్కనకు 'దశకుమారచరిత్రం' అంకితంచేసి అవతారికలో విలువైన విశేషాలను చరిత్రకు అందించినాడు. అలాగే శ్రీనాథుడు బాగా దేశ పర్యటన చేస్తూ, పలు ప్రాంతాలను సందర్శించాడు. కన్నడ, తమిళ, తెలుగు ప్రజల జీవిత వృత్తాల నీడలు శ్రీనాథుని చాటుపద్య దర్పణాల్లో లీలగా కనిపిస్తాయి. ఆ చాటువుల్లో ఆయనను సమాదరించిన ప్రభువులు, మంత్రులు, దండనాథులు, బంధువులు, శిష్యులు, మిత్రులు, దర్శన మిస్తారు. అసామాన్యులు, సామాన్యులు, జవరాండ్రు, వెలయాండ్రు, కరణాలు, రసికులు, అరసికులు, ఆయన చాటువులను వాటేసుకున్నారు. పల్లెలు, పట్నాలు, గుళ్లు, గోపురాలు, అంగళ్లు, సంతలు, తిరునాళ్లు ఆయన చాటువులతో నిలిచి, కలిసి మెలిసి తిరిగినవి. ఎందరో భక్తులు ఆయన చాటువుల్లో ధ్యానమూర్తులుగా నిలుచున్నారు. అంతటి మహానుభావుని జీవితంలో అనేక సందర్భాల్లో చెప్పిన చాటువులన్నింటిని ఉదహరించి వివరించడం ఇంత చిన్న పొత్తంలో సాధ్యం కాని పని.

అయినా ఆయన మహనీయ వ్యక్తిత్వాన్ని, ఆయన ఆత్మవిశ్వాసాన్ని, ఆయన ధిషణాహంకృతినీ సాక్షాత్కరింపజేసుకోవడానికి ఒక చాటుపద్యంలోని రెండు పాదాలను మాత్రం ఉదాహరిస్తాను.

'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ
అరుగు చున్నాడు శ్రీనాథుడ మరపురికి' 30

రెడ్డిరాజులంతరించి వడ్డెరాజుల కాలం వచ్చింది. వాళ్ళు ముష్కరులు, అరసికులు, విద్యాసంస్కార రహితులు. శ్రీనాథమహాకవి విలువను గుర్తించ లేకపోయినారు. భోగవిలాసాలతో, విద్వద్గోష్ఠులలో జీవితం గడిపిన ఆ మహాకవిది వడ్డెరాజుల కాలంలో చరమదశ. ఆ దశలో ఆయన శృంఖలాబద్ధుడై, వీపున బండమోస్తూ, అపార కవితాసంపదను తెలుగు ప్రజలకందిచ్చి దివగంతుడైనాడు. ఆ స్థితిలోకూడా ఆయన ఆత్మవిశ్వాసం సడలలేదు. ప్రతిభమొక్కవోలేదు. చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టు తాను స్వర్గానికిపోతే అక్కడి కవివరుని స్థానం తాను ఆశ్రయిస్తాడట. దేవతల కవివరుడు బృహస్పతి గుండెలు గుబగుబలాడుతున్నాయట— శ్రీనాథుడొస్తే తన పదవి గతేమిటి?

ఎంత గొప్పచాటు పద్య శకలమిది? మహాకవికి ఇంత ఆత్మవిశ్వాసం ఉండాలన్నమాట. ఎంత గొప్పగా చదువుకుంటే, ఎంత గొప్పగా వ్రాస్తే, ఎంత పాండిత్య వీరాన్ని ప్రదర్శిస్తే, సమకాలికులవలన ఎన్ని గౌరవమర్యాదలు పొందితే శ్రీనాథునికి ఆత్మ విశ్వాసం అబ్బింది? శ్రీనాథుని ఈ చాటువు ఒక కిటికీ వంటిది. దీనిద్వారా ఆయన బ్రహ్మాండమైన వ్యక్తిత్వాన్నీ, 'బ్రాహ్మీదత్త వరప్రసాద' కవితావైశారద్యాన్నీ, మూర్తీభవించిన ప్రజ్ఞావతారాన్ని సందర్శించవచ్చు.

* * *

ప్రాచీనాంధ్ర సాహితీసంపదను మనకు అందించినవారిలో మెకనీజ్ బ్రౌను దొరలు ఆద్యులు. వారి తరువాత పేర్కొనతగినవారు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, మానవల్లి రామకృష్ణకవిగారు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు క్రిములకాహారమవుతున్న ఎన్నో చాటుపద్యాలను సేకరించి, సాధ్యమైనంతవరకు వాటి కర్తృత్వాన్నీ, సందర్భాలనూ, వివరించడానికి యత్నించి సంకలనాలుగా మలిచి తెలుగుప్రజలకు అందించి చరితార్థులైనారు. ఆయన చూపిన వెలుగుబాటలో నడిచి చాటుపద్యాలను సేకరించడానికి ఎందరో సహృదయ విద్వాంసులు ప్రయత్నించినారు. గతంలో ప్రయత్నాలు క్వాచిత్కంగానైనా కొనసాగుతున్నవి. ఈ చాటు పద్యాలు ఇంకా ఎన్నో అముద్రితాలుగా ఉన్నవి. సరసుల నాలుకల కెక్కినవి ఎన్నో ఉన్నవి. ఆధునిక మహాకవులు చెప్పిన చాటు

వులు సహస్రాధికం కారణాంతరాలవల్ల ఆధునికుల చాటువులను ఏరుకుని వ్యాఖ్యానించలేకున్నారు.

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి కుమారులు ఆచార్య వేటూరి ఆనంద మూర్తిగారు, శ్రీశాస్త్రిగారి ముద్రితాముద్రిత సాహిత్యాన్నంతటినేగాక, శాస్త్రిగారికి ఆయన అంతేవాసులూ, మిత్రులూ, వ్రాసినలేఖలనూ, వ్యాసాలనూ, పద్యాలనూ సేకరించి 'మణిమంజరి' అనే షాణ్మాసిక వాఙ్మయ మాసపత్రికలో ప్రచురిస్తున్నారు. తెలుగు పరిశోధకులకి, ముఖ్యంగా ఈ తరానికి తెలియని ఎన్నో అంశాలు ఆ పత్రికలో ఆంధ్రాంగ్లభాషల్లో ఎరుకపరచడానికి ఉద్యమిస్తున్నారు. శ్రీశాస్త్రిగారు చాటుపద్యాలను సేకరించిన వైనం ఇందులో మనకు కనిపిస్తున్నది. శాస్త్రిగారు చెప్పిన చాటువులు కూడా ఇందులో ఉన్నవి.

ఆచార్య ఆనందమూర్తిగారు నాపట్లనూ, 'యువభారతి' పట్లనూ, ఉన్న అభిమానం వల్ల శ్రీశాస్త్రిగారి కొన్నిపద్యాలను ఏరుకునే అవకాశం కల్పించినారు. వారికి నాధన్యవాద పరంపరలు.

1925లో గాంధీమహాత్ముడు మద్రాసు వచ్చినప్పుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన పద్యం—

వినయ కుటీరంబునన నిల్పితివి గదా
    గర్వ పర్వతము పైగాపులు వారి
పొం తొలగించి కాన్దెర పించితివి గదా
    యైశ్వర్య భోగాంధులైనవారి
తినిపించితివిగదా తన యింట తియ్యఁగూర
    పొరుగింటి పుల్లగూర రయువారి
స్వాతంత్ర్య వీథిలోఁ జన జేసితివి గదా
    పారతంత్ర్యపు గొంది బడలువారి

అలసితివిగా జగంబెల్ల నాత్మ గృహము
మాడ్కి నీవంటి యుత్తమ మర్త్యుఁడేడి?
జయము నీకెందు నీకార్య చయమునందు
సత్కృపాకంధి మోహన చంద్రగాంధి. 31.

జీవితంపట్ల శాస్త్రిగారి దృక్కోణాన్నీ, దేశీయసమస్యలపట్ల ఆయనకున్న గభీరమైన అవగాహననూ, గాంధీగారిపట్ల ఆయనకున్న ఆదరాభిమానాలనూ, ఈ పద్యం వ్యంజిస్తున్నది.

గాంధీమహాత్ముడు వినమ్రమూర్తి. గర్వపర్వతం మీద వినయకుటీరాన్ని నిలిపినాడని కవితాత్మకంగా చెప్పినారు.

నిరాడంబరత్వాన్నీ, భోగపరాఙ్ముఖత్వాన్నీ తొలగించినాడట గాంధి ఈ భావం ఈ పద్యం కావ్యబద్ధం అయిన తీరు అమేయం. 'పొర తొలగించి కన్దెరపించినా'డట. బానిసలై వ్యక్తిత్వాలను కోల్పోయి, భోగపరవశులై తామున్న తమశ్శాలనే స్వర్గమనుకుంటూ, పొగలు గమ్మిన కన్నులతో తామున్న భ్రమను ప్రమగాభావిస్తూ బ్రతుకుతున్న భారతీయులకు ఆయన జ్ఞాన నేత్రం ప్రసాదించినాడు. జాగృతి కలిగించినాడు. పెనునిద్దుర మత్తును వదిలించినాడు

మూడవ పాదంలో తెనుగు నుడికారం, జాతీయం శాస్త్రిగారి కవితా ప్రతిభకు ఒదిగి పోయింది.

స్వదేశీ ఉద్యమం, స్వదేశాభిమానం, స్వభాషాభిమానం, స్వదేశ సంస్కృతి పరిరక్షణం, గాంధీజీ ప్రజల్లో ప్రజ్వరిల్ల చేసినాడని భంగ్యంతరంగా అంటే కావ్యభాషాబద్ధంగా అభివర్ణించినారు శ్రీ శాస్త్రిగారు.

బానిసతనపు టిరుకు సందుల్లో బ్రతుకులీడుస్తున్న స్వదేశీయులకు స్వేచ్ఛావీధుల్లో విహరించగలిగే సామర్థ్యాన్ని కలిగించినాడు గాంధీజీ.

"దాస్యం అన్ని పాపాలకంటే పెద్ద పాపం" అని ప్రచారం చేసి స్వేచ్ఛాప్రియత్వాన్నీ, స్వేచ్ఛకోసం పోరాడే మనస్సంస్కారాన్ని రంగరించి ప్రబోధించినాడని ధ్వని.

'వసుధైక కుటుంబమ్' అన్న ఆర్యోక్తికి అనుగుణంగా తన మనస్సునూ జీవితాన్నీ మలచుకొని లోకం అంతా తన ఇల్లేనని నమ్మినాడు గాంధి. ఆయన వంటి మానవుడు ఉంటాడా ? ఆయన కరుణామూర్తి సత్కృపాసాగరుడు.

సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాల్లో అంచులు ముట్టిన శేముషీ సంపదను కష్టపడి సంపాదించిన శాస్త్రిగారు నిరంతర తాళపత్ర గ్రంథ పరిశోధనలో, విమర్శ వ్యాసరచనలో, నిమగ్నులై వుండికూడా 1925 లోనే గాంధీమహాత్ముని గూర్చి చేసిన ప్రశంస ఆయన యుగోచితాగ్రగామిత్వాన్ని వ్యంజిస్తున్నది. ఆయన గాంధీజీ సంకీర్తనం కావ్యబద్ధమైనది. అక్షరమైనది. శ్రీ శాస్త్రిగారి మనస్సంస్కారం ఎంత ఆర్ద్రమైనదో, ఆలోచన ఎంత సునిశితమైనదో, దృక్పథం ఎంత విశాలమైనదో, ఎంత భవిష్యద్దర్శననైపుణీ సముపేతమైనదో.

శ్రీ శాస్త్రిగారి అన్నకుమారుడు పసితనంలోనే నూరేళ్ళు పూర్తి చేసుకుని దివికేగెనట. ఆ సందర్భమున శాస్త్రిగారు చెప్పిన చాటువుల్లో ఒకదాని నిక్కడ ఉదాహరిస్తున్నాను. కరుణరసం చాటువుకు ప్రేరకం. వ్యాఖ్యానాన్ని అపేక్షించని కవితకు తార్కాణం ఈ పద్యం.

కొమరు నొసంగుమంచు నినుఁ గోరిన దెవ్వరు? లేని పోని ము
ద్దు మురిపముల్ "వెలార్పుమని తొందఱ పెట్టిన దెవ్వ
రయ్యయో!
యమృతము తీపు సూపి విషమావలఁ బెట్టిన యట్టులిత్తఱిం
గుమిలి కృశింప నీకడుపుఁ గోతకుఁ దార్చితివేమొదైవమా !

తెలుగు నుడికారానికి ఎంత శక్తివుందో ఈ పద్యం తెలుపుతున్నది. ఈ పద్యంలో ఛందస్సు, పదాలు మనకు కనిపిస్తాయి. కుమిలిన మనస్సు వినపడుతుంది. కవి శోకం పద్యమైంది. కవి ఆర్ద్రమనస్కత శ్రోతల కన్నుల్లో ప్రవేశించి చెమ్మగిలుతుంది. మనసున్న మనిషిని వ్యాఖ్యానం చేసి నొప్పించాలని లేదు.

అసమాన దాన విద్యా
రసికత లేనట్టి నరుని బ్రతుకేటికి సీ

కసవేఁబుక తిని బ్రదుకదె
పసరము తన కడుపునిండఁ బర్వత కొండా! 33.

ఈ పర్వత కొండదెవ్వరో తెలియదు. పేరు మాత్రం'యాదగిరిగుట్ట'లాగాఉంది. తనను ఉద్దేశించి చెప్పుకున్నాదో, మరే కవియైనా అతణ్ణి ఉద్దేశించి చెప్పినాదో తెలియదు. 'పర్వతకొండా' అనే మకుటంతో శతకమేదైనా ఉందో తెలియదు.

కుక్షింభరుల జీవితాన్ని నిరసిస్తున్నాడు ఈ పద్యంలో కవి.

స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో ఇంగ్లీషు విద్యా బోధన పద్ధతిని నిరసించడం అప్పటి దేశభక్తుల లక్షణం. ఇంగ్లీషు బడులలో విశ్వవిద్యాలయాల్లో చదువుతున్న విద్యార్థులు ఎందుకూ పనికిరాని పట్టభద్రులై దేశానికి భారమవుతున్నారనీ, గుమస్తాగిరి తప్ప ఏమీ చేతగాని బానిసలుగా సిద్ధ మవుతున్నారనీ విమర్శలుండేవి. ఒక ఉర్దూ కవి అప్పటి కాలేజీ చదువులను ఇలా అధిక్షేపించినాడు. ''కాలేజ్ కెళ్ళినాడు. గ్రాడ్యుయేటు అయినాడు. నౌకరై నాడు. చచ్చిపోయినాడు.''

ఇలా దేశానికి పనికిరాని చదువు ఒక చదువుకాదు. అలాగే ఒరులకు అంటే అవసరం వున్నవాళ్ళకు సాయం చేయకపోతే అంటే దానం చెయ్యకపోతే ఆ సంపద వుండి ఏమి లాభం? చదువూవుండి, సంపదావుండి రసికత లేకపోతే? రసికత అంటే ఎదుటివాడి మాటల్లో, చేతల్లో ఉన్న మంచితనాన్ని గుర్తించి హర్షించే ఔదార్యం. అందాన్ని చూసి మురిసిపోయే మనసుండటం. అందం, మంచితనం ఎక్కడున్నా, ఎవరిలోవున్నా చూడగలిగే దొడ్డమనసు రసికతకు మారు పేరు. అసమానంగా అంటే ఒకరినిమించి, పోటీపడి విద్యను సంపాదించాలె. దానం చెయ్యాలె. రసికునిగా వ్యవహరించాలె. కేవలం ఇంత తిని పొట్ట నింపుకుని బ్రతుకు సాగించడం పశుత్వం అనిపించుకుంటుంది. పసరంలాగా బ్రతకడం కూడా ఒక బ్రతుకేనా? పసరం తనకోసమే బ్రతుకుతుంది. తన ఆకలి తీరితే చాలు. ఎలా తీరినా సరే. ''తనకోసం తాను తినేవాడు పసరంలాంటి వాడు. తాను తిని ఇతరులకు పెట్టేవాడు మనిషి. తనకు లేకపోయినా సరే ఇతరులకు లభించాలె అనుకునేవాడు దైవత్వం ఉన్నవాడు'' అనే ఆర్యోక్తికి పెద్దల్లో మంచి ప్రచారం ఉన్నది.

వలవని కాంతకై తిరుగు వాఁడొక మాల, ధనంబుగూడియున్
వలసిన వస్తువుల్గొనని వాఁడొక మాల, సభాస్థలంబులన్
వలసిన తప్పువ్వేదుకు వాఁడొక మాల దుగాని యూరికిన్
వెలుపల నిల్లుగట్టినను వాఁడొక మాలఁడుగాడు పృథ్విలోన్.

అస్పృశ్యతను నిరసిస్తున్నాడీకవి. ధర్మస్వరూపాన్ని, తత్త్వస్వరూపాన్ని, ఎరుగని కొందరి ధార్మికప్రబువులు మూఢ విశ్వాసాల వలల్లో చిక్కుకుని కలిమినీ, బలిమినీ ఉపయోగించుకొని, తమ మనుష్యజాతిలోని కొందరిని అంటరాని వారనీ, చండాలురనీ పృథక్భావంతో వ్యవహరించినారు. జ్ఞాన సంపన్నుడైన ఏమత ప్రవక్తకూడా అస్పృశ్యతను సమర్థించలేదు. ధర్మబద్ధమనలేదు. శంకర భగవత్పాదులు, శ్రీమద్రామానుజులు, దయానందులు, వివేకానందులు ఇంకా ఎందరెందరో ! చిత్రమేమిటంటే ఈ మహానుభావుల అనుయాయులమని చెప్పుకుంటున్న వాళ్లు అస్పృశ్యతను పాటించినారు. జన్మచండాలుడు అనాదరణీయుడు కాడు ఎందుకంటేఏదైనాజాతిలోకాని,ఏదైనాదేశంలోకాని, ఏదైనాకులంలోకానిపుట్టడానికిగాని మానవుడు చేయగలిగిందేమీలేదు. జన్మతః బ్రాహ్మణుడైనంత మాత్రాన ఎవ్వడూపూజనీయుడుకాడు. జన్మచండాలునికంటేకర్మచండాలుడు గర్హనీయుడు గిట్టనివాణ్ణిముట్టుకోకూడదన్నభావం కొంచెంముదిరితే,అంతస్థునుబట్టి, పలుకుబడిని బట్టి అధికారాన్ని బట్టి, . హోదాను బట్టి ముట్టు కోకూడదనే మనస్తత్వం ఏదో ఒక రూపంతో మనిషి పెంపొందించుకుంటూ వస్తున్నాడు. అప్పటి రాజకీయ ఆర్థికవ్యవస్థలుకూడాఅందుకు తోడౌతూ వస్తున్నవి. ఇప్పుడు మన రాజ్యాంగ నిర్మాతలు మన సంస్కృతి ఆంతర్యాన్ని అవగతం చేసుకున్న మహనీయులు, అస్పృశ్యతకూ, అసమానతలకూ మన రాజ్యాంగంలో స్థానంలేదు. మనది లౌకిక ప్రజాస్వామ్యం.సరే! రాజకీయ స్థాయిమాట ఎలాఉన్నా సాంఘిక పరిస్థితిని పరిశీలిస్తే అస్పృశ్యతను ఇంకా అక్కడక్కడ పాటిస్తున్న సందర్భాలు కనిపిస్తున్నవి. జ్ఞానోదయం తగినంత కలగలేదన్నమాట.

నిన్నటి మొన్నటి కాలంలో అస్పృశ్యులు ఊరివెలుపల ఇళ్లు కట్టుకునే వారట. ఇప్పుడు మాత్రం! అస్పృశ్యులు దేవుని బిడ్డలు. వాళ్లు హరిజనులు. వాళ్లకు అపకారంచేస్తే దేవునికే అపకారం చేసినట్లు అవుతుంది. పరుల కష్టా

లను గుర్తించి తీర్చేవాడే నిజమైన భక్తుడు. సరియైన మానవుడు. గాంధీమహాత్ముడు. తనకు మళ్లీ జన్మలభిస్తే హరిజనుణ్ణిగా జన్మించి ఆ కష్టాలను భరిస్తానన్నాడు. అంటరానివారిని పూజ్యభావంతో చూడాలనే ఉద్దేశంతో ఆమహాత్ముడు వాళ్లను 'హరిజనులు' అన్నాడే కాని అస్పృశ్యులు అనే మాటకు పర్యాయవాచిగా మాత్రంకాదు. 'అగ్రకులాల' వాళ్ల ఇండ్ల మధ్య హరిజనులకు ఇండ్లు కట్టించడానికి బదులు ఈ రోజుల్లోకూడా వాళ్లకు వేరే బస్తీలను కట్టిస్తున్నారు. హరిజన విద్యార్థులకు వేరే వసతిగృహాలు ఏర్పాటు చేస్తున్నారు. తెలిసో తెలియకో, అస్పృశ్యత సంఘంలో సమసిపోకుండా నిలిచిపోతున్నది. జన్మతః వాళ్లు 'అజ్ఞానులు' 'పాపాత్ములు' 'దౌర్భాగ్యులు' అన్న భావం వాళ్లల్లో బలపడిపోవడానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

ఈ చాటుపద్యం వ్రాసిన కవి ఎప్పటివాడో చెప్పలేముకాని, మనకు స్వాతంత్ర్యం రాక పూర్వం ఉన్నవాడని మాత్రం చెప్పవచ్చు. కులంలో ఏమీలేదు, అంతా ప్రవర్తనలోనే ఉంది. ఎవడు మాలవాడు? అంటే ఈ కవి ఎప్పుడో చెప్పినాడు-

తానంటే అసహ్య భావం ఉన్న స్త్రీ కోసం తిరిగేవాడు. మానభంగానికి కూడా వెనుదియని పశువు మాలవాడు.

ద్రవ్యం ఉన్నా ఖర్చు అయిపోతుందిగదా అని దారిద్ర్య బుద్ధితో ప్రవర్తించే పిసినిగొట్టు మాలవాడు.

సభల్లో సరసంగా ప్రవర్తించక, తప్పులనేరుకుంటూ, అక్కడుండే వాళ్ల సమయాన్ని, మనస్సులనూ పాడు చేసేవాడు మాలవాడు.

అంతేకాని ఊరికి వెలుపల ఇల్లుకట్టుకున్నవాడు మాలవాడుకానేకాదు.

నిజానికి దొంగవేషాలు వేసేవాళ్లు, దొంగబుద్ధులున్నవాళ్లు, అస్పృశ్యులు. కుళ్లు బుద్ధులున్నవాళ్లు అస్పృశ్యులు. కల్తీసొమ్ము అమ్మేవాళ్లు అస్పృశ్యులు. తాము పండితులు కాకపోయినా పండితులకు రావలసిన గౌరవాదరాలు తమకు లభించాలని కుయుక్తులు పన్నేవాళ్లు అస్పృశ్యులు.

మహాకవి గురజాడ -

"మంచి యన్నది మాలయైతే
మాల నేనగుదున్" అన్నారు, ఏడుదశాబ్దాలకు పూర్వమే!

కనుక మేం 'మాలలం' 'మాదుగులం' 'బ్రాహ్మణులం' 'ఫలానాకులాల వాళ్లం' అని చెప్పుకునే దాని కంటే మంచి పనులు చేస్తే, దేశహితంకోసం పాటు పడితే 'కులంకాదు గుణంప్రధానం' అన్నఋషుల వాక్కుకు ప్రచారం కలిగిస్తే వ్యష్టికీ మంచిది. సమిష్టికీ మంచిది. ఇదే ఈ పద్యంలోని పరమార్థం.

ఈ పద్యం శ్రీ శ్రీరంగాచార్యుల 'చాటుపద్య రత్నావళి'లోనిది.

నరుఁడనువాఁడు ఖాండవ వనంబు వృధా దహనంబు జేసె, వా
నరవరుఁడైన యాపవననందనుఁడూరకలంకఁ గాల్చెఁ గాల్చెఁనా
హారంబు పురంబు లార్చెనన నంతియెకాని మహాదరిద్ర వి
స్ఫురణను గాల్చు వాఁడొకఁడు భూమి జనింపక బోయె భూవరా!

ఈ పద్యం ఒక సంస్కృత చాటు శ్లోకానికి అనుసృతి. సుగ్రీహీత నామధేయులు శ్రీ దువ్వూరి వేంకట రమణ శాస్త్రిగారు చెప్పగా ఆచార్య బి. రామరాజుగారు వ్రాసుకునిరట. శ్రీ శ్రీరంగాచార్యులుగారీ పద్యాన్ని, తమ సంపాదకత్వంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, వెలువరించిన 'చాటు పద్య రత్నావళి'లో ఉదాహరించినారు.

రామాయణం, మహాభారతం, కథాసరిత్సాగరం, మధిర సుబ్బన్న దీక్షితులు వ్రాసిన కాశీమజిలీకథలు, 18 పురాణాలు కనీసం వచనంలోనైనా చదువుకోవాలె. అప్పుడు తెలుగు సాహిత్యం చదువడానికి ప్రయత్నిస్తే ఆయా కవుల ప్రతిభాపాండిత్యాల సంగతులు తెలిసివస్తాయి. ఎన్నో సామెతలకు, ఎన్నో పొడుపు కథలకు, ఎన్నో పదబంధాలకు, ఎన్నో పదాలకు అర్థాలు తెలిసివస్తాయి.

చాటు పద్యాల వీధుల్లో మనం పచార్లు చేస్తుంటే అడుగడుగునా పురాణేతిహాసాల్లోని కథలూ, సన్నివేశాలూ, వ్యక్తిత్వాలూ మనలను పలకరిస్తాయి. పరామర్శిస్తాయి. మన ఇంగిత జ్ఞానాన్నీ, మన సంప్రదాయపరిజ్ఞానాన్నీ పరీక్షిస్తాయి. చాటుపద్యాల చాటున ఎంత జ్ఞానభాండాగారం ఉందో తెలుసుకోవడం

కష్టం. కాశీమజిలీకథలు, కథాసరిత్సాగరం మనకు తేటతేట తెలుగువచనంలో వ్రాసినవే లభిస్తాయి. ఇక పురాణేతిహాసాల సంగతి! అవికూడా వచనంలో వ్రాసినవి దొరుకుతాయి. చదివితే తెలుస్తుంది. ఈ రోజు మనం జానపద కథలు అనుకుంటున్నవన్నీ జ్ఞానపదులు వ్రాసినవేనని. మనం స్వప్నంలో కూడా ఊహించలేని అనల్పకల్పనా మహితములు ఆ పురాణ కథలు.

ఈ పురాణ కథలతో కొంత పరిచయం ఉంటే తప్ప ఈ పద్యంలోని సారస్యం అవగతం కాదు.

అర్జునుడు ఖాండవ వనాన్ని వృథాగా కాల్చివేసినాడు. హనుమంతుడు మరేమీపనీపాటా లేనట్టూ లంకానగరాన్నే కాల్చినాడు. ఆ తరువాత లంకలో తాను చూసిన సీత ఏమైపోయిందోనని వాపోయినాడు. విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షులు అనే రక్కసుల పట్టణాలను శివుడు దహించినాడు. ఈ మూడు దహన కాండలకు ఏవో కారణాలుండవచ్చు. ఏదో మహా విషయం వీటికి భూమిక కావచ్చు. ఆ ముగ్గురు మహనీయులు దేవతా మూర్తులు. అనంత శక్తిమంతులు. అధికాధిక మవుతున్న దారిద్ర్యాన్ని దహించే వాడు భూమిలో ఇంతవరకూ పుట్టలేదుకదా! దారిద్ర్యం కర్మ ఫలం అని ఏ బుద్ధిమంతుడూ ఎన్నడూ నమ్మలేదు. అది అభిలషణీయమని ఎవడూ, ఎన్నడూ వరించలేదు. అందరూ గర్హించినారు. దారిద్ర్యం అంతమొందాలని అందరూ కోరుతూనే వచ్చినారు. అయితే దారిద్ర్యాన్ని ఒక పథకం ప్రకారం రూపుమాపే ప్రయత్నం సంఘపరంగా, ప్రభుత్వపరంగా నిన్నటి దినాల్లో జరుగలేదేమో! నిన్నటి పరిస్థితుల దృష్టితో పరిశీలించ వలసి ఉంది. అది వేరే విషయం. 'దారిద్ర్యవిద్రావణా' అనే మకుటంతో నన్నెచోడుడు శివుణ్ణే ఉద్దేశించి శతక ప్రక్రియాస్ఫూర్తితో వ్రాసిన తొమ్మిది పద్యాలు మనకు ఆయన 'కుమార సంభవ' కావ్యంలో కనిపిస్తున్నాయి. ప్రాచీన కావ్యాల్లో దారిద్ర్య నిరాసం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కనిపిస్తూనే ఉంటుంది.

ఖాండవ దహనానికంటె, లంకాదహనానికంటె, త్రిపుర దహనానికంటె, దారిద్ర్య దహనం ప్రయోజనకరమైనదనీ, మహత్తరమైనదనీ, మానవతా సంక్షేమ క్షమమనీ కవిహృదయం. ఈ కవికి 'సామాజిక స్పృహ' లేదనగలమా? ఆ నాటి పురాణాలకూ, తన కాలంనాటి దారిద్ర్యానికీ సంబంధం

కల్పించుకున్న తీరు చమత్కారంగా ఉన్నది. మానవుల సమస్యలను తీర్చలేని దేవుళ్ల, దేవేరుల మహిమాభివర్ణనం ఎందుకనే ఎత్తిపొడుపు లేకపోలేదీపద్యంలో.

"శివుడు అర్ధనారీశ్వరుడు అంటే సగం మొగతనంగలవాడు. అతనికంటే ఓ కృష్ణరాయా! నీవే గొప్ప. నీవు పూర్ణ పురుషుడవు" అని దేవుళ్ళ కంటే మనుషులే గొప్ప వాళ్లని తెగ పొగడి మడులూ, మాన్యాలు పొందిన కవులూ పురాణాలు చదువుకున్నవారే. ఈ చాటువు వ్రాసిన కవి కూడా పురాణాలు చదువుకున్నవాడే. కాని ఈ కవి దృక్కోణం వేరు. పరిహాస పద్ధతి వేరు. వ్యంగ్యార్థ ప్రతిపాదన వేరు. పురాణ కథలను ఉపయోగించుకున్న తీరువేరు. ఎలా చెప్పవలెనో రావాలె. అంతేకాని పాతకథ, కొత్తకథ అని వింగడింపులు చేసుకుంటూపోతే మిగిలేది అంతంత మాత్రమే ఉంటుంది. పాతది తెలియని వానికి పాతది కొత్తగానే కనిపిస్తుంది. కొత్తదేదో తెలుసుకోవడానికి పాతదేదో తెలియవలసి ఉంటుంది.

"కొత్త పాతల మేలుకలియక
క్రొమ్మెరుంగులు జిమ్ము"తుందనే కవితకు అందం.

'సరసిజనేత్ర! నీ విభుని చారుతరంబగు పేరు చెప్పమా;
అరయఁగ నీవునన్నడుగు నాతని పేరిదె చిత్తగింపుమా ;
కరియును వారిరాశి హరుకార్ముకమున్ శరమద్దమున్ శుకం
బరుదుగ వ్రాయఁగా నడిమియక్కరముల్ గణుతింపఁబేరగున్'

కొడిగట్టిన చాటుపద్య దీపాలనెన్నింటినో తమ కవితా సౌహార్ద స్నేహంతో తిరిగి వెలిగించిన ఆ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి సంపాదకత్వాన వెలువడిన 'చాటుపద్య రత్నాకరము' లోనిదీ పద్యం.

ఈ రోజుల్లో పత్రికల్లో వచ్చే నుడికట్టులు వెనుకటి కాలానలేవు. అయినా నిఘంటువులను చూసే అలవాటును పాఠకుల్లో పెంపొందించే ప్రయత్నం ఆనాటి కవులు చేసేవారు. మహాకావ్యాల్లో పదాలకు అర్థాలు చూసుకోడానికేకాక నానార్థాలనూ, పరిమితాక్షరాల పదాలనూ, తెలుసుకునే ఉత్కంఠ పఠితృలోకంలో కలగాలె. కొంత పరిశ్రమచేస్తేగాని అంతుపట్టని పద్యాలు వ్రాస్తే పాఠకులకు

బాధకలుగదా! పురాణకథలు తెలిసి ఉండవలె. రకరకాల నిఘంటువుల సాయంతో అర్థం రాబట్టుకోవలె. ఈ ప్రయత్నంవల్ల పదజాలంతో పరిచయం ఏర్పడుతుంది. పెద్దపెద్ద కావ్యాలు చదివే పద్ధతికి దారి ఏర్పడుతుంది.

మహాకావ్యాల్లో ఇలాంటి పద్యాలు అరుదుగా ఉంటాయి. చాటువుల్లోనే ఇవి ఎక్కువగా కనిపిస్తున్నాయి.

"పద్మాక్షి! నీభర్త అందమైన పేరు చెప్పవా?"

"తెలుసుకోడానికి నన్ను నీవడుగు, ఆయన పేరిదే చిత్తగించు"

కరి = సారంగం (ఏనుగు), వారిరాశి = సాగరం, హరుకార్ముకము = పినాకం, శరము = సాయకం, అద్దము = ముకురం, శుకము = చిలుక. సారంగం, సాగరం, పినాకం, సాయకం, ముకురం, చిలుక. పై ఆరుపదాలలోని నడిమి అక్కరములను కలిపితే 'రంగనాయకులు' అవుతుంది. ఆ సుందరాంగి భర్త పేరు 'రంగనాయకులు' అని ఎంత సుందరంగా చెప్పింది?

తనభర్త పేరున్న అక్షరాలు కల పదాలు మూడక్షరాల్లోనే ఉండాలె. సరిగ్గా ఆమె భర్తకు సరిపోయే అక్షరం ఒక్కొక్కటి ప్రతిపదం నడుమ వరుసగా రావాలె. ఇన్ని నియమాలను దృష్టిలో పెట్టుకుని ఈపద్యాన్ని విశ్లేషించాలె. అందుకే అన్నదామె 'అరయగ నీవునన్నడుగుమ'ని. 'అరయు' అనే క్రియా పదంలో ఉంది చమత్కారం. 'అరయుట' అంటె తెలిసికొనుట, పరిశీలించుట అనే అర్థాలున్నవి.

ఇలాంటిదే మరో పద్యం శ్రీ దీపాలవారుదాహరించినది.

మనుజుని యాకార మహిమకు మొదలెద్ది?
నగవైరి వైరిదౌ నగరమెద్ది?
రఘుపతి కాచిన రాక్షసాండజమెద్ది?
శిబికర్ణు లార్జించు చెలువమెద్ది?
పంచబాణుని వింటఁ బరగెడు రుచియెద్ది?
గిరిపతి భుజియించు గిన్నెయెద్ది?
నయనాంగరక్షనమువైన బలమెద్ది?
చెలఁగి మానముఁగాచు చెట్టదెద్ది?

అన్నిటికిఁ జాడ రెండేసి యక్కరములు;
అదులుడు పంగఁ దుదలెల్ల నాదులగును;
చెప్పునాతఁడు భావజ్ఞశేఖరుండు
లక్షణోపేందర్శ! కృష్ణరాయక్షితీందర్శ! 37

కొంత పరిసరాల పరిజ్ఞానం, కొంత లోకజ్ఞానం, కొంత పురాణేతిహాస కథా పరిచయం ఉన్నవాళ్లకీ పద్యం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. ప్రాచీనగాథలను తెలుసుకోవాలనే కుతూహలాన్ని రేకెత్తిస్తుంది. ఆయా దేవతామూర్తుల స్వరూప స్వభావాలతో పరిచయం చేసుకోవాలనిపిస్తుంది. ఇది సీస పద్యం. కింద ఉన్న తేటగీతిలోగాక పైన నాల్గుపాదాల్లో 8 ప్రశ్నలున్నవి.

ప్రశ్నార్థక చిహ్నంతో ప్రశ్నముగుస్తుంది. ప్రత్యుత్తరం రెండక్షరాల్లోనే ఉండాలె.

1. తల, 2. లంక, 3. కాకి, 4 కీర్తి. 5 తీపి, 6 పురె, 7. రెప్ప, 8. పత్తి. ఇట్లా సమాధానాలు చెప్పినవాణ్ణి 'భావజ్ఞశేఖరు'నిగా గుర్తిస్తాడట కవి.

నిఘంటువులంటే కల్పతరువులు అనే నానుడి ఇంమకే ప్రచారంలో ఉన్నది. సత్కవులుగా, సహృదయవిమర్శకులుగా, ఆశుకవితాస్రష్టలుగా, ప్రాచీనకావ్య పరిష్కర్తలుగా, గీర్వాణాంధ్రభాషా విశారదులుగా, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు యావదాంధ్ర భాషాభిమానులకు చిరపరిచితులు. చాటుపద్యాలను సేకరించడంలోనూ, వాటిని వివరించడంలోనూ ఆయన చూపిన శ్రద్ధాసక్తులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని జ్ఞప్తికి తెప్పిస్తాయి.

ఆయన సంపాదకత్వంలో వెలువడిన 'చాటుపద్య రత్నాకరము'లోని ఈ పద్యాన్ని పరికించండి. సాహిత్యాధ్యయనంలో వ్యాఖ్యానాలకు ఉన్న ప్రాముఖ్యాన్ని కవితాబద్ధంగా చెప్పిన పద్యం ఇది. వ్యాఖ్యాన రచనం ఒక సంప్రదాయం. అరుదైన పాండితీగరిమకూ, అర్ద్రమైన సహృదయతకూ ప్రతీక. వేదాలకూ, ఉపనిషత్తులకూ, పురాణేతిహాసాలకూ, మహాకావ్యాలకూ వ్యాఖ్యానాలు వెలువడినవి. వ్యాఖ్యానాలే లేకపోతే మానవుడు సృష్టించుకున్న వాఙ్మయం నేటికి

మృగ్యమైపోయి ఉండేది. కొన్ని సందర్భాల్లో మనకు సరియైన జ్ఞానం వ్యాఖ్యానాల మూలంగానే లభిస్తుంది. కొందరు వ్యాఖ్యాతలు వ్యాఖ్యానం చేస్తూ స్వీయ ప్రతిభా పాండిత్యాలను కూడా ప్రదర్శించి, మూల రచయిత చెప్పని కొన్ని వినూత్న విషయాలను ప్రతిపాదించి ప్రజ్ఞాధురీణులనిపించుకున్నారు. ఎంత గొప్ప కావ్యమైతే అంత గొప్ప వ్యాఖ్యాత దానికి లభిస్తాడు. మూలంలోని అంశం సామాన్యమైనదైతే వ్యాఖ్యానం అనవసరం. మల్లినాథుడు, అభినవగుప్తుడు, కాటయవేముడు, వేదం వేంకటరాయశాస్త్రి, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, దూసి రామమూర్తి శాస్త్రి, ఇంకా మరికెందరో మనీషివతంసులు సంస్కృతాంధ్ర కావ్య వ్యాఖ్యాతలుగా ప్రసిద్ధిని పొందినవారున్నారు. 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు తాము వ్యాఖ్యాతృ శిరోమణులమని చెప్పుకున్నారు. ఆయన ప్రాచీనాంధ్ర కవుల పద్యాలకు వ్రాసిన వ్యాఖ్యానం 'కావ్య సురభి' గా అవతరించింది. నన్నయ్యనుంచి కంకంటి పాపరాజు వరకున్న గొప్ప తెలుగు కవుల పద్యాల చెలువమునకు ఆయన విలువకట్టిన తీరును చూడని తెలుగు పాఠకుడే ప్రాచీన కావ్యాలనుగూర్చి పలుచగా పలుకుతాడు. నిజానికి నన్నయ నుంచి వీరేశలింగంపంతులుగారి వరకు తెలుగులో వెలువడిన కావ్యాలు నేటికి అర్థంచేసుకోగలుగుతున్నామంటే ఈ వ్యాఖ్యాతల పుణ్యంవల్లనే. కవికీ విమర్శకునికీ మధ్య వ్యాఖ్యాత అక్షర సేతువువంటివాడు. వ్యాఖ్యానం సహృదయుని కనువెలుతురు. కావ్య గతాంశాలను వ్యాఖ్యానం స్థూలంగా పరిచయం చేస్తుంది. ఆస్వాదించే సహృదయుని సూక్ష్మబుద్ధి అంతకు మించిన ఆంతర్యాన్ని కన్గొనవచ్చు అయితే కావ్యంలో ఏముందో తెలియవలెగదా. ఆ కావ్యంలో పదాలకు అర్థం తెలుసుకొనవలెగదా! కవి భావం స్థూలంగా తెలుసుకోవలెగదా! శాస్త్రీయాలోచన చేసి వ్యాఖ్యాత ఒక్కొక్కసారి ఛందోవ్యాకరణాలంకారాది విశేషాలనుకూడా తెలుపుతాడు. అది వేరే విషయం. సహృదయుడు అంతటితో ఆగడు. నిజమైన సహృదయుడు కావ్యాత్మ సందర్శనంకోసం అన్వేషిస్తాడు. అయితే ఆ ఆత్మ ఆశ్రయించిన శరీరాన్ని నిర్దుష్టంగా గుర్తుపట్టగలగాలె. ఈ స్థితిలో వ్యాఖ్యానం తోడ్పడుతుంది. అంతేగాని మూలంలో ఏముంది? అంతా వ్యాఖ్యాత చమత్కారంలోనే ఉంది అనడానికి వీలులేదు. మూలంలో ఏమీ లేకపోతే వ్యాఖ్యానం పుట్టనే పుట్టదు. కాళిదాసంతటి మహాకవి లేకపోతే, మల్లినాథునంతటి వ్యాఖ్యాత పుట్టనే పుట్టదు.

దీపాలవారు వ్యాఖ్యాన ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తున్న చాటువు నొకదానిని ఉదాహరించినారు.

కొమ్మాలపాటి యోబన కవి ఒకడుండేవాడు. మంచెళ్ల కృష్ణయ్య అనే ఒక కవి వ్యాఖ్యానంతో ఉన్న వసు చరిత్రను ఓబన కవికిస్తానని చెప్పి, కొన్నాళ్ళకు మూలం మాత్రమే పంపించినాడట. అప్పుడు ఓబన కవిలోని కవిత పొంగులువారింది. సీసపద్యంగా జాలువారింది. సరికొత్త పోలికల పూలజల్లును కురిపించింది.

షడ్రసోపేత భోజనమిడి యతనికి
నా పోశనము నీక యలచుకరణి
అతిపిపాసార్తున కమృత కూపము జూపి
"చేదలే" దనుచు వచించుమాడ్కి
దర కన్యాదాన మొనరించి తజీనిగ
ర్భాధాన మొనర జేయని పగిదిని
దర్పణాంతరమున ధనరాశిఁజూపించి
కొనుమెంత వలసిన ననువిధమునఁ

దెలిసియును, నయ్యొ! సవ్యాఖ్యఁ దెచ్చియీక
మూలమంపితి వేటికి? మూలధనము
మూలధనమన్న యట్లు సమూల మొసఁగు
పొల్లుపుచ్చకు తృష్ణ! మంచెళ్లకృష్ణ. 38

మూలధనం మూలలోనే ఉండిపోయినట్లు, నీవు నాకు కేవలం మూల గ్రంథం పంపిస్తే ఏంచేసుకుంటాను. నా కావ్యాధ్యయన తృష్ణను పొల్లు చేయకు. నా అభిరుచిని చంపకు. వ్యాఖ్యానం కూడా పంపించు. వ్యాఖ్యానం లేకుండా వసుచరిత్రను ఆస్వాదించడం ఎవరికి సాధ్యం? ఒక్క శతాబ్దంలో ఇద్దరికో, ముగ్గురికో !

నీవు వ్యాఖ్యానంలేని వసుచరిత్ర నాకు పంపించడం ఎలా ఉందంటే—

షడ్రసోపేతమైన వంటకాలను విస్తరిలో వడ్డించి ఆపోశనం ఇవ్వకుండా భోక్తను బాధపెట్టినట్లుంది.

మిక్కిలిగా దప్పిగొన్నవానికి నీళ్లబావిని చూపి 'ఎట్లాచేదిపోసేది చేద లేదే' అన్నట్టుగా ఉంది.

వివాహంచేసి గర్భాధానానికి అవకాశం లేకుండా చేసినట్లుంది. అద్దంలో ధనరాశిని చూపించి 'నీకు కావలసినంత తీసుకో' అన్నట్లుగా ఉంది.

నాలుగు పరిస్థితుల్లో మనిషిమనోరీతి ఎట్లా ఉంటుందో సహృదయులకు తెలియకపోదు. కనుకవ్యాఖ్యానం మూలానికి సంరక్షకం,మూలానికి అలంకారం. మూలానికి ప్రయోజనకరం. కనుకనే వ్యాఖ్యానాలు 'సంజీవనీ వ్యాఖ్య'లుగా, 'హృదయోల్లాస వ్యాఖ్య'గా, 'రమణీయ వ్యాఖ్య'గా రత్నాపణ వ్యాఖ్యలుగా పరిమళవ్యాఖ్యగా ప్రఖ్యాతిని పొందినవి.

నరసింహ కృష్ణరాయని
కరమరుదగు కీర్తి యొప్పెఁ గరిభిద్గిరిభి
త్కరి కరి భిద్గిరి గిరిభి
త్కరి భిద్గిరిత్తురంగ కమనీయంబై 39

శబ్దాలగారడీ చేసినట్టుంది. ఈ పద్యం తెనాలిరామకృష్ణునిదని పెద్దలమాట. కీర్తిని ప్రసిద్ధమైన తెల్లని వస్తువులతో పోల్చడం కవుల పరిపాటి.

శ్రీకృష్ణదేవరాయల కీర్తి మిక్కిలి అరుదైనదట. అది కమనీయంగా అలరారిందట కరిభిత్=గజాసురారి (శివుడు), గిరిభిత్కరి=కొండలకు శత్రువైన ఇంద్రుని ఏనుగు (ఐరావతం), కరిభిత్గిరి=శివునికొండ (కైలాసం), గిరిభిత్=వజ్రాయుధం, కరిభిత్, గిరిభిత్ తురంగములు=శివుని, ఇంద్రుని వాహనములు=నంది, ఉచ్చైశ్శ్రవం. శివుడు=తెల్లనివాడే, ఐరావతం తెల్లనిదే. వజ్రాయుధం తెల్లనిదే ,నంది, ఉచ్చైశ్శ్రవాలు తెల్లనివే

శబ్దంపైనా, అర్థంపైనా సంపూర్ణాధికారం ఉన్నవాని కేఇలాంటి రచన సాధ్యం. పురాణేతిహాసాలు చదువుకున్న వాళ్లకే ఈ పద్యంలో సారస్యం తెలియడం సాధ్యం. కవులు ఇంత కష్టపడి, పఠితలను ఇంత కష్టపెట్టడమెందుకు? ఆ చెప్పే దేదో సులభంగా చెప్పివేస్తే సరిపోదా? అనుభవ యోగ్యములైన, రుచ్యములైన ఫలాలన్నీ ఒకే మాదిరిగా ఉండవు. కొన్నింటిని కష్టపడి తినవలసి ఉంటుంది. కొన్నింటిని సునాయాసంగా తినవచ్చు. కొన్ని గట్టివి. కొన్ని మెత్తనివి. కొన్ని తియ్యనివి, కొన్ని పులుపు తీపుల మేళికలయికలవి. ఏ పండు తినాలని ఎవడికనిపిస్తే వాడు వాడి తంటాలు వాడు పడి ఆ రుచులను అనుభవిస్తాడు. ఆటల్లోనూ ఇంతే. కదలకుండా కూర్చుని చదరంగం ఆడవచ్చు. చెమటలు వచ్చే టట్లు చెడుగుడులాడవచ్చు. అన్ని ఆటల్లోనూ ఆనందముంది ఎవరి సంబరం వానిది. ఎవని వేడుక వానిది. అందరికీ అన్నీ అర్థంకావాలని నియమం ఏమీలేదు. కొంచెం కృషి చేయకపోతే ఏ భాషలోనైనా లోతులు తెలియవు. పదాలకు నానా ర్థాలూ పర్యాయ వాచికాలు, లక్ష్యార్థాలూ, వ్యంగ్యార్థాలూ, సాంప్రదాయికార్థాలూ ఉంటాయి. మహోన్నత సిద్ధాంతాల కోసం ఒక వ్యక్తి ప్రాణాలర్పించినప్పుడు 'మరణించినాడు' అంటే సరిపోతుందా? స్ఫూర్తి వస్తుందా? ఆత్మార్పణం చేసి నాడు' 'ఆదర్శాలకోసం ప్రాణాన్నే పణంగా పెట్టి పోరాడి వీరస్వర్గమలంకరించి నాడు. ఇత్యాది వాక్యాల్లో చెప్పవలసి వస్తుంది. భావాన్ని బట్టి భాషకు ఉదాత్తత వస్తుంది. అలాంటి ఉదాత్తతను సమకూర్చగలిగిన రచయితకు తన భాషలో అనంత శబ్దజాలంతో పరిచయం ఉండాలె. పదునారేండ్లు చదివిన శ్రద్ధ చది వించిన వ్యవస్థ ఏ మాత్రం ఇంగ్లీషును భారతీయులకు నేర్పగలిగినవో మనకు తెలియదు. అందులో సగభాగమైనా కృషిచేస్తే మనకు తెలుగు, మహా కావ్యాలను అర్థం చేసుకోగలిగే తెలుగు పట్టుబడకపోవునా? ప్రాచీనుల కావ్యాల మాటకేమి! పరవస్తు చిన్నయసూరి 'నీతిచంద్రిక' కూడా కఠిన శైలిలో ఉందనీ అది తెలుగుకానే కాదనీ, ఒక వేళ అయినా మరీ పాతదనీ వాద వివాదాలు చెలరేగు తున్నవి. గత శతమానంలోని ఇంగ్లీషు రచయితల మాటకేమి, 18వ శతాబ్ది ఆంగ్ల రచయిత కృతులను చదువనిదే ఇప్పటికీ ఇంగ్లీషు చదువు పూర్తికాదు. పాండిత్యం ఏర్పడదు. నేటి ఇంగ్లీషు పత్రికలను చదివి అర్థంచేసుకోలేరు.

తెలుగులో కూడా స్థితి ఇంతే. వార్తా పత్రికలు చదవడం వేరు. వార మాస పత్రికల్లోని కథలూ నవలలూ కాలయాపనకోసం చదవడం వేరు.

సాహిత్యాధ్యయనానికి కొంత శ్రద్ధ, కొంత తపన, కొంత అన్వేషణాదృక్పథం అలవరచుకోవడం అవసరం. మనకు అర్థం కానివన్నీ నిరర్థకాలనీ, నిరుపయోగాలనీ అనుకోవడం సంస్కృతి అనిపించుకోదు. వ్యాఖ్యానాల వెలుతురులో, పండితుల సాంగత్యంతో సత్కావ్యాలను చదివి అర్థం చేసుకోవచ్చు. ఆనందం పొందనూవచ్చు. విజ్ఞానం పొందనూవచ్చు. తరింపనూవచ్చు.

మనసిజుమామ మామయభిమాన మడంచిన వాని మామ నం
దనుని విరోధి నందనుని నందను సుందరి మేనమామఁ జం
పిన జగ జెట్టి పట్టిఁ బొడి జేసిన శూరుని తండ్రిఁ గన్నుగన్
గొనిన సురాధినాథుని తనూభవువాయువు మీకు నయ్యెడున్ 40

భారతం, భాగవతంలోని కథలు తెలిసినవాడు ఈ పద్యంలోని వ్యక్తులను గుర్తించి వారినిందులో పొదిగిన తీరుకు ఆశ్చర్యపడుతాడు. ఇంతకూ ఇది ఆశీరమృతాన్ని కురుస్తున్న పద్యం. ఈ చాటువు వ్రాసిన కవి ఎవడో కాని తన పద్యం చదువుకున్నవాళ్ళను దీవిస్తున్నాడు. శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి 'చాటుపద్య రత్నాకరము'లోనిదీ పద్యరత్నం.

మనసిజుని మామ = మన్మథుని తల్లి తోబుట్టువు లక్ష్మి సోదరుడు చంద్రుడు. (ఆయన) మామ = దక్షప్రజాపతి. అభిమానాన్ని అంటే గర్వాన్ని అణచినవాడు శివుడు. ఆ శివునికి మామ హిమవంతుడు. అతని నందనుడు అంటే కొడుకు మైనాకుడు. ఆ మైనాకుని విరోధి కొడుకు అర్జునుడు. అతని నందనుడు అభిమన్యుడు, అతని భార్య ఉత్తర, ఆమె మేనమామ కీచకుడు. ఆ కీచకుని హతమార్చినవాడు భీముడు. అతని కుమారుడు ఘటోత్కచుడు. అతణ్ణి చంపినవాడు కర్ణుడు. ఆ కర్ణుని కన్నతండ్రి సూర్యుడు. ఆ సూర్యుని కన్నుగా గలవాడు విష్ణువు. అతని కొడుకు బ్రహ్మ. ఆ బ్రహ్మ దీర్ఘాయువు. ఆ బ్రహ్మాయువు మీకు కలుగుగాక అని కవి దీవన.

మామలు, తండ్రులు, కొడుకులు, బిడ్డలు, తండ్రులు, శత్రువులు ఒకరితో నొకరికి గొలుసు కొక్కెలములవలె సంబంధములు గూర్చి ఈ కూర్చి చమత్కారం చేసినాడు.

*　　　*　　　*

దీవన దొంతరలతో అలరారుతున్న 'ఈ చాటువులు' అనే పుస్తకం ముగిస్తున్నాను. చాటువులు మహానుభావులవి. 'నేను లోకాలోక వ్యాఖ్యానం' మాత్రం చేసినాను. సహృదయులకు ఈ చిన్న పుస్తకం ఏ మాత్రం ఆనందం కలిగించినా నాయీ ప్రయత్నం ఫలించిందని భావిస్తాను. చాటు పద్య వాఙ్మయం పట్ల పాఠకుల్లో కొంత సమాదర భావం కలుగడానికి ఈ నా వ్యాఖ్యానం అనుకూలిస్తే కృతార్థుణ్ణే.

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3